# కేసరి రత్నత్రయము

## లోధ్ర

**గర్భాశయరోగనివారిణి**

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అమృత

**రక్తశుద్ధిద్రావకము**

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, పొమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునుయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-0-0 6 ఔ. రు. 2-2-0

## అర్క

**సర్వజ్వరనివారిణి**

ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమను జ్వరిగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డి రూ. 1-2-0

**తపాలా ఖర్చులు ప్రత్యేకము**

## కేసరి కుటీరం లిమిటెడ్

**ఆయుర్వేద ఔషధశాల**

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు :

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు..**

# విషయ సూచిక






సంపాదకుడు

## డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౧ ]　　నవంబరు 1949　　[ సంచిక ౧౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకు సరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




జయజయ గృహలక్ష్మి సఖీ జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

# భీభత్సము

"మానవుడొకడు ప్రకృతిని వశంచేసుకొని ఆటంబాంబు కనిపెట్టాను. ఆ రహస్యం నాది. మరోడికి చెప్ప"నని బింకం చూపుతాడు. "ప్రకృతి రహస్యం; నీ ప్రాజాపత్యమేమిటి ; నేనూ కనుక్కుంటా ; కనుక్కున్నా" అని మరొకడు అంటే, గంగ వెర్రులెత్తి - పదిచేతులా బాంబులుచేసి మేటి వేస్తాను - అని పరుగులెత్తుతాడు. ప్రకృతి ఫక్కున నవ్వుతుంది !

ఆనవ్వే - అగ్నిపర్వతాలు ; తుపానులు ; ఉప్పెనలు; దావాగ్నులు. ఇంతా నెలకాలేదు; బ్రహ్మాండమైన వర్షాలుకురిసి - ఆంధ్రదేశంలో దక్షిణభాగానఉన్న నదులు, వాగులు, వంకలు పొంగిపొరిలి, చెరువులు, దొరువులు తెగి ఏకమై-గ్రామాలు, పట్నాలు వెల్లువమయంచేశాయి. పెన్న, గుండ్లకమ్మ, కృష్ణ మూడూ వరదలు పారాయి. పినాకినీ నది 'పల్లికొండ శ్రీ రంగనాధస్వామి వారిని' నెల్లూరున సన్నిధిలోకివచ్చి సేవించుకొని వెళ్ళినదట. ఆ భీభత్సమునుండి ఇంకాజనం బయటపడి తేరుకోనేలేదు.

ఇంతలో మళ్లీ ప్రకృతి విజృంభించింది. పర్జన్యుడు, ప్రభంజనుడు వియ్యమందారు. దేవేంద్రుని కీఆంధ్ర దేశంమీద ఏమికోపమో - నవమేఘాలు విడగొట్టాడు. సుమారు 48 గంటలు, చీరాల మొదలు శ్రీకాకుళంవరకు - కుండలతో నీరు కుమ్మరించినట్లు వర్షము, గరుత్మంతుడు రెక్కలు విసురుతున్నట్లు పెనుగాలి - పల్లె, పట్నం, ధని, నిర్ధని, చిన్నా పెద్ద, పూరిగుడిసె, పెద్దమేడ, పశువు, పక్షి, మనిషి, వాగూ, వంక, డొంక-చేను, పుట్ట, గుట్ట రైలురోడ్డు, కారురోడ్డు, - అన్ని - ఈ భీభత్సానికి తలఒగ్గక తప్పలేదు. అది వంద అటంబాంబుల చర్య. దానినంతా వేరే వివరంగా తెల్పాము.

ఇళ్లు లేక బాధపడుతున్న కాలంలో ఇళ్లు కూలిపోయాయి. ఆహారధాన్యాలు చాలక తంటాలు పడుతుంటే పంటలు పాడైపోయాయి. పాడి తగ్గి కృత్రిమపు నేతికి చేయిజాచే రోజుల్లో, హెచ్చుపండించను, పశుసంపద నాశించే దినాల్లో పశుగ్రాసమే గాక పశువులు నష్టమైనాయి. అనేకవిధాల-మనస్థితిగతులను పునర్నిర్మాణం చేసుకొనుటకై యత్నారంభుల మవుతుంటే - సర్వమూ తల్లక్రిందులై - కొన్నిలక్షలు వెచ్చిస్తేనేగాని, కొంతకాలానికిగాని, తిరిగి ఆ ప్రాంతంపుజనం కుదటపడని అవస్థ తటస్థించింది.

ఇంతటితో పోయినదా? కొన్ని సంవత్సరాలుగా జనానికి చాలీచాలని తిండి. ఈ భీభత్సంవల్ల బెంబేలెత్తిన మనస్సులు, పిల్లా, జెల్లా ముసిలీ, ముతకా, బాలింత, చూలింత — అంతా వర్షంలో తడిసిఉంటారు. నెత్తిన ఆచ్ఛాదనగాని, చుట్టూ అడ్డంగాని లేకుండా ఎన్నిలక్షలజనం — ఎన్నాళ్లు చెమ్మలో అల్లాడవలసివస్తుందో. ఈచెమ్మ ఆరే లోపల - రేగే రోగాలకు — అరిపేదప్రాణాలు ఎన్ని ఆహుతి అవుతాయో ?

ఈ భీభత్సాన్ని మానవుడు శిరసావహించవలసినదే గాని—ఏలా ఎదుర్కొంటాడు; ఆపుచేస్తాడు ? ఇట్టి నిరంకుశ ప్రకృతి పాలబడి చీకాకైన - ఆయా ప్రాంతాల ప్రజలయెడ గాఢమగు మా సానుతాపమును వెలిబుచ్చుచున్నాము. దయామయి జగదీశ్వరి - తనబిడ్డలను ఒక చెంపగొట్టి నొప్పించినా, రెండోబుగ్గ పుడికి లాలింపదా ? అనే "గృహలక్ష్మి" ధైర్యము; ఆశ.



# మహిళాభ్యుదయోత్సవములు

## శ్రీమతి బొడ్డుపల్లి బాలాత్రిపుర సుందరమ్మగారికి సన్మానము.

గుంటూరు పట్టణ మహిళాసంఘపక్షమున గుంటూరునందు గాంధీజయంత్యోత్సవంతోపాటు అక్టోబరులో మహిళాభ్యుదయోత్సవములు అతివైభవముగ జరుపబడినవి. సూత్రయజ్ఞము, రాట్నపోటీ జరిగినది. శ్రీమతి ఆదుర్తి భాస్కరమ్మ, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గుడిపూడి ఇందుమతిదేవి లీలా సాంబమూర్తిగార్లు దినమున కొకరు అధ్యక్షతవహించినారు. ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘాధ్యక్షురాలైన కొండ పార్వతీదేవిగారు, గాంధి మహాత్ముని నిర్మాణ కార్యక్రమమున స్త్రీల కర్తవ్యమును గురించియు, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు మహిళాసంఘ చరిత్రను, స్త్రీల ఓటుహక్కు నెట్లు ఉపయోగించవలసినదియు ఉపన్యసించిరి. గుడిపూడి ఇందుమతీదేవిగారు ఆంధ్ర సారస్వతమును గురించియు, ఆదుర్తి భాస్కరమ్మగారు మహిళాభ్యుదయమును గురించియు ఉపన్యసించిరి.

వాదవివాదము, పోతన పద్యములు, భగవద్గీత, ముగ్గుల పోటీలు జరుపబడినవి. గెలుపొందిన వారికి బహుమతు లివ్వబడినవి.

7—10—49 న గుంటూరునందు మహాలక్ష్మి పఠన మందిరము స్థాపించి 18 సం. నుండి స్త్రీల విజ్ఞానముకొరకై, అతిశయమగు సేవజేయుచున్న శ్రీమతి బొడ్డుపల్లి బాలత్రిపురసుందరమ్మగారికి గుంటూరు



పట్టణ మహిళాసంఘ మహాలక్ష్మి పఠనమందిరముల పక్షమున సన్మానము గావించబడినది. సన్మానపత్రము, వెండి కుంకుమ భరిణయు సమర్పించబడినది. కొండ పార్వతీదేవిగారు, గుంటూరు పట్టణ మహిళాసంఘ అధ్యక్షురాలు కలెక్టరు సతీమణి అయిన శ్రీమతి రుక్మిణీ ప్రభాకరరావునాయుడుగారు, గుంటూరుజిల్లా కార్యదర్శిని పంగులూరి రాజ్యలక్ష్మమ్మగారు, గుంటూరు పట్టణ మహిళాసంఘ కార్యదర్శిని, తురగా మాణిక్యాంబగారు, గుంటూరు శ్రీ సనాతన ధర్మమండలి కార్యదర్శిని పొత్తూరి చెల్లమ్మగారు, గుంటూరు లేడీస్ రిక్రియేషన్ ( Guntur Ladies Recreation Club ) కార్యదర్శిని, శ్రీమతి పార్వతీశమ్మగారు శ్రీమతి బాలత్రిపుర సుందరమ్మగారొనర్చిన సేవనుగ్గడించుచూ, ఉపన్యసించిరి.

* బ్రహ్మశ్రీ కవిమూర్ధన్య - కింకవీంద్ర ఘటాపంచానన - బాలసరస్వతీ -
* బాలకళానిధి - విద్వత్కవి - కళాప్రపూర్ణ - శతావధాని - చెళ్లపిళ్ల - *
* వేంకటశాస్త్రిలుగారి ఆస్థానాంధ్రకవి సమ్మానమహోత్సవము.

అభివందన పద్యములు

# బ్రహ్మతేజస్సు

శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారు

తనదైన దర్శనం బొనరించు నాశ్రితు
లెందేని నభయంబు నొందఁగల్గు
తనదు పాదాభివందన మాచరించు నం
తేవాసులు ఘనులై నెగడఁగల్గు
తన నామధేయంబు మనమందు నెంచిన
వారెల్ల పాపముల్ వాయఁగల్గు
తనకొక్క యింత సేవను జల్పు మాత్రాన
నిహపరంబుల నింపు నెనయఁగల్గు
తన శుభాశీస్సు లబ్ధి యాంధ్రమున సంస్కృ
తమున సాహిత్య సౌహిత్య ధన్యతఁగన
నగును బ్రహ్మతేజోమయు నల్ల చెళ్ల
పిళ్ల వేంకటశాస్త్రిని బేర్మి నెంతు.

కవిచంద్రుండు దయాంబురాశి కుకవి క్రవ్యాద శిక్షాగురుం
డు విశాలామలకీర్తి వైభవయుతుండున్ నిర్వికల్పావధా
న విభూత్తముఁడు చెళ్లపిళ్లకులచంద్రస్ఫూర్తి విద్వద్వరుం
డవు శ్రీవేంకటశాస్త్రి మద్గురునకున్ సాష్టాంగముల్ సల్పెదన్.

అరవిందాసనురాణి వాణి శుభలీలార్థంబు పుంభావ రూ
పరుచిన్ రెండు తెఱంగులై తిరుపతి ప్రఖ్యన్ మతిన్ వేంకటే
శ్వరురూపొంద ద్వితీయమౌళి నిజశిష్యవ్రాత రక్షార్థమై
స్థిర విద్యావిజయంబిడున్ విజయవాటిన్ భర్మదుర్గాఽఽ ద్యుతిన్.

# తుపానువల్ల ఆంధ్రదేశాన కలిగిన భీభత్సం

అక్టోబరు 26 వ తేది రాత్రినుండి, 28 వ తేది రాత్రివరకు విపరీతమైనగాలి, వానలతో పెద్దతుపాను ఆంధ్రదేశాన్ని భీభత్సంచేసేసింది.

విశాఖపట్నంజిల్లాలో నాగావళి, వంశధార నదులుపొంగి శ్రీకాకుళం ప్రాంతాలగల పట్నాలకు పల్లెలకు అపారనష్టం కల్గించాయి. శారద, వరాహ, తాండవనదులు వరదలై యలమంచిలితుని ప్రాంతాలను జలమయం చేసినవి. తూ॥ గోదావరి జిల్లాలో లింగంపర్తిచెరువు తెగి ఏలేటిలో పడ్డది; గట్లమీద గ్రామాలను ముంచేస్తూవచ్చి కాకినాడవద్ద ఏరూ, సముద్రం ఏకమైనాయి. ప॥ గోదావరిలో కొల్లేటి మధ్యలంకలు మునిగిపోయాయి. కృష్ణాజిల్లాలో బుడమేరు విపరీతంగా ప్రవాహంవచ్చింది. దాని పరిసరాలలోఉన్న గ్రామాలనన్నిటిని ముంచేసింది; గుడిసెలను కూలద్రోసింది. పశువులను మనుష్యులను మ్రింగింది. శవాలు విధీవిరామంలేకుండా తెప్పదేలిపోతున్నాయి. అతివృష్టివల్ల చీరాల, బాపట్ల పొన్నూరు, గుంటూరు, సత్తెనపల్లి, నర్సారావుపేట, తాలూకాలలో పలుగ్రామాలు జలమయమైపోయినవి. కృష్ణాకాలువలు నిండి నిబిడీకృతమైనాయి. విజయవాడ వాల్తేరులమధ్య తంతితీగలు, టెలిఫోనుతీగలు ధ్వంసమైపోయినాయి. విజయవాడ వాల్తేరులమధ్య రైలుకట్ట పలుప్రాంతాల తెగిపోయింది. రైలుకట్టపై నీరు ప్రవహించుటచేత ఎక్కడ తెగిందికూడ కొన్నిచోట్ల తెలియలేదు. ఆరెండురోజుల గాలికి వాల్తేరునుండి బయలుదేరిన బండ్లనడక మందగించింది. ఇటు మద్రాసునుండి బయలుదేరిన బండ్లు పొన్నూరు, బెజవాడలవద్ద నిలిచిపోయినాయి. ఇటు గన్నవరం నూజవీడులమధ్య రైలుగండ్లుపడ్డాయి, అటు అన్నవరం వాల్తేరులమధ్య రైలుగండ్లుపడ్డాయి. నవంబరు రెండవతేదీనాటికి విజయవాడనుండి గన్నవరానికి, నూజవీడునుండి అన్నవరానికి మాత్రమె రైలుబండి సరాసరి సాగడం జరిగింది. బెజవాడకు ఉత్తరం ఆనాటికింకా తంతితీగలు బాగుకాలేదు.

బెజవాడ బందరు, బందరు గుడివాడ, బెజవాడ నూజవీడు రోడ్లు అధ్వాన్నమైపోయినాయి.

ముఖ్యంగా ఈ గాలివానదెబ్బ - బందరు, గుడివాడ, విజయవాడ, గుంటూరులకు తగిలిందనవాలి. ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, వారలకున్నూ కొంతకొంత దెబ్బతగిలింది. ఈ పట్నాలన్నిటిలోను, గాలివానరోజుల్లో విద్యుచ్ఛక్తి తంతులుచెడి చీకటిఏర్పడింది. దాని మూలాన నీటి సరఫరా కట్టుపడ్డది. వర్షాధిక్యతచేత ఇండ్లుకూలాయి. గాలి బలాన చెట్లు విరిగిపడ్డాయి. ఎలక్ట్రిక్ స్తంభాలుకూలాయి. పూరిగుడిసె లెగిరిపోయాయి. అంతంతమాత్రం ఇండ్లు అల్లల్లాడాయి. షెడ్డులకు కప్పువేసిన జింకురేకులు ఎగిరిపోయి మైళ్ళదూరానపడ్డాయి. విజయవాడలో ఎవరికిన్నీ బయట తలచూపడానికి వీలులేకుండా గంటకు 70 మైళ్లు వేగంతో గాలివీచింది. కృష్ణాగోదావరి డెల్టాలలో వరిపంటకు విస్తారమైన నష్టము. ఒక్క కృష్ణాజిల్లాలోనే 20, 25 లక్షలరూపాయలదాకా నష్టమని అంచనావేశారు. ఒక్క గుడ్లవల్లేరులోనే 2లక్షలు నష్టమంటూరు. గుంటూరు జిల్లాలోకూడా 20 లక్షలదాకా నష్టమంటున్నారు. ఇంకా ఉభయగోదావరులు, విశాఖజిల్లాల నష్టం పూర్తి అంచనా తేలలేదు. తూ॥ గోదావరిలో 10,000 ఎకరాలపంట ముంపుఅంటున్నారు.

గుడివాడలో 20 మంది ఇండ్లుకూలి మరణించారు. బెజవాడవద్ద బుడమేరులో 20 మంది కొట్టుకొనిపోయినారు. బందరులో 7 వేల ఇళ్లు కూలిపోయినాయట. ఈ ఇండ్ల క్రిందపడి కొందరు మరణించారుకూడ. తేలప్రోలులో 36 గురు చచ్చిపోయినారు. బెజవాడలో కాకులు - నిలువ నీడవలేక గాలిలోఎగురలేక పడి చచ్చిపోయాయి. గుడిసెలుకూలిన నక్కలవాళ్ళ కవేమొన్నాడు తినడాని కాధారమైనాయి. గుడివాడరోడ్డున దిక్కులేని శవాలను కుక్కలు పెరుక్కొనితిన్నాయి. అన్ని పల్లెటూళ్ళలో ఇండ్లుపడి, పాకలుపడి మనుష్యులకు పశువులకుకూడా నష్టంకలిగింది. ఇదివరలో 3 తుపానులు నేను స్వయంగా చూచి సహాయకార్యాలలో పాల్గొన్నాను; ఇంతటి భీభత్సం చూడలేదని - ఢిల్లీనుంచివచ్చి బెజవాడలో చిక్కుబడిన కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకట్రావుగారన్నారు. అన్నిచోట్ల అమాంబాపతు 200 మంది చనిపోయిఉంటారు - అని రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగారంటారు. బాధితుల నివారణకై రు 2 లక్షల 50 వేలు ప్రభుత్వంవారు మంజూరుచేశారు, ఇది చాలదని అందరూ అంటున్నారు.

# నెల్లూరి భక్తులు:
# కీర్తిమూర్తులు శ్రీ పిల్లారిసెట్టి కోదండరామదాసుగారు

కీ॥ శే॥ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు

దాసుగారి గ్రంథములు ప్రాయికముగ భగవత్ప్రి పత్తములుగ నున్నవి. నీతిశతక మొకటిమాత్రము మనుష్యప్రసక్తముగ నున్నది. ఇదియు నరస్తుతి ప్రరోచకముగాక తమస్నేహితులును తాముండిన కచేరిలో పెద్దమునిషియుద్యోగస్థులునగు నొకరికి హితోపదేశముజేసి వారిని సన్మార్గప్రవర్తకులుగ జేయుటయె అందలి పరమార్థముగనున్నది.

తమ రంగపతీశతక పీఠికయందు తమ గ్రంథరచన కాలము "౧౮౩౬ వ సంవత్సరం, జనవరినెల మొదలు కొని ఇది అచ్చువేసిన ౧౮౮౯ వ సంవత్సరం, మార్చి నెల 30 తేది వఱ"ని వ్రాసియున్నారు. అయితే రంగనాయకశతకమున 108 వ పద్యమున ఈ శతక రచన కాలము "విజయసంవత్సరాశ్వీజ శుక్లము" అని చెప్పబడియుండుటచే పైనచెప్పిన ౧౮౩౬ నకు ముందె గ్రంథరచనా ప్రారంభమయినటుల కనబడుచున్నది. రంగనాయకశతక రచనకాలమగు విజయసంవత్సరము క్రీ. శ. 1833-34 అగుచున్నది. ఇందు కొలదిపాటి పరస్పరభేద మగపడుచున్నది. రంగపతిశతక ముద్రణము 1889 లో జరిగినది. అప్పటికి రంగనాయక శతకముచెప్ప 55-56 ఏండ్లు గడచినది. ఈరెంటి మధ్య గడచిపోయినకాల మింత దీర్ఘముగ నున్నందున ఈ పరస్పరభేద మంతగ పాటింపదగినదికాదు. ఉరామరికపు గణనముమీద నిదియొక భేదముగ నెన్నదగినది కాదని యూహింపదగును.

ఇప్పటికి తెలిసినంతవరకు వీరి రచనలు కాలక్రమమున నీక్రిందివిగ నున్నవి:—

1. రంగనాయక శతకము—108 సీస పద్యములు గలయది.
2. నీతిశతకము—121 కందపద్యములు గలది.
3. అంజనేయ తారావళియు—మంగళహారతియు—తారావళి—28 శార్దూల మత్తేభములు.
4. శ్రీరంగేశ తారావళి—27 కందములు.
5. రంగనాయకుల నవరత్నమాలిక—9 శార్దూల మత్తేభములు.
6. రంగనాయకమ్మ నక్షత్రమాలిక—27 చంపకోత్పలములు.
7. రంగపతిశతకము—108 చంపకోత్పలములు—దీనియందు ఆళ్వారాదుల ప్రశంసలు గలవు.
8. రంగనాథదండకము.
9. రంగాష్టకస్తోత్రము—8 చరణములు—సంస్కృత ద్వితీయాంకనామ స్తోత్రము.
10. పాటలు—శ్రీ కృష్ణలీలలు—లాలి పాటలు—మంగళహారతులు.
11. రామకృష్ణభక్తుల సంవాదము—185 చరణములు గలిగి యొక మంగళహారతితో సమాప్తి.

వీరికి కవనశక్తి కడుపిన్నవయసుననె యలవడినటుల రంగనాయక శతకమునందలి పదునాల్గవ పద్యమువలన తెలియుచున్నది:—

♦ ♦ ♦

ఏ నోముఫలమొకో యీనరజన్మంబు గని పదునాలుగేండ్లు గర్హితముగ
కాలమజ్ఞానత గడిపి సద్గురువుల కల్పవృక్షముపోలె గాంచి నేడు
వారి సత్కృపజెంది శౌరి నిను గనుగొంటి నభయంబు కృపసేయు మార్తవరద
నీదుభజనము వేదప్రణీతమగుడు యెపిసేయగలేనయ్య యోమహాత్మ
బుధజనోల్లాస నెల్లూరి పురనివాస రంగనాయక కోదండరామపోష.

వీరి శైలిరీతులు తెలియుటకై ఆయా గ్రంథములనుండి కొన్ని పద్యములు వాక్యములు పాటల చరణములు నీ క్రింద యుదహరింపబడుచున్నవి.

1. రంగనాయక శతకము.

ఆకలికన్నంబు యాచింతునంటినా నీవె (1)భిక్షుకుఁడవై నిల్చినావు
దండమంచమునిన్ను ప్రార్థింతునంటినా కొండయాదల నీవె యుండినావు
కతిపయమగు పాన్పు కాంక్షింతు నంటినా ముదిపాముపై నీవె యొదిగినావు
ఎక్కగుఱ్ఱము నిచ్ఛయించెద నంటినా పక్షిమూపుననీవె ప్రబలినావు
వరములడిగిన నీలేనివాఁడవనుచు త్వత్పదంబులుగోరితి ధనముగాఁగ
బుధజనోల్లాస నెల్లూరి పురనివాస రంగనాయక కోదండరామఘోష.   76

2. నీతిశతకము.

న్యాయంబువిడిచి ద్రవ్య ముపాయంబుగఁ గొనుటకన్న భాసిసలనముం
జేయుచు బ్రతుకుటమేలు సుధీ యతులిత సుగుణ ధారు వేంకటరమణా.   27

3. ఆంజనేయ తారావళి.

కనుఁగొంటిఁ నృపసీత నజ్జనని జక్కఁ ముద్రికఁ మ్రొక్కి మీ
రొక్కని ముద్దాడి రహస్య సూక్తులను వాక్రుచ్చెఁ వినుండన్న వా
ర్త నిజంబా మదినుండు తాపమును బారందోలి నీచెంత న
న్ననయంబుఁ జక్కఁజేర్పుమో నమదు పేయా యాంజనేయప్రభో!   14

4. శ్రీరంగేశ తారావళి.

శ్రీమత్పినాకినీ ప్రాగ్భూమి స్థిత తల్పశిఖరీ పుంగవ భాస్వ
ద్ధామ రవిధామ సద్గుణ సీమా నెల్లూరివాస శ్రీరంగేశా.   1

5. రంగనాయకుల నవరత్నమాల.

అకటా కాకముకన్న నెక్కుడగు పాపాత్ముండనైతోక్కొ నీ
దు కటాక్ష ప్రసరామృతాబ్ధి నను నెంతోముంచరా వజ్రరా
గకిరీటా వనచారి వర్ణి నృహరంగ ద్వాబ్ధి కల్కి క్రమ
ప్రకటారాతి విభంగ తల్పగిరి రంగా దైవచూడామణీ.   6

6. రంగనాయకమ్మ నక్షత్ర మాలిక.

సారసనేత్ర చక్రధరు చల్లని యుల్లమునందు గిన్కరా
నేరదు వచ్చెఁబో యతని నీవు మృదూక్తుల బుజ్జగించి మా

---

(1) వామనావతారమున కన్పించును - లేక తిరునాళ్లలో మోహినిసేవ కన్పించును.

నేరముఁబాచి సత్కృతులె నేరుపుమీర నుతింతుగాన నె
ల్లూరి నివాసినీ ననుపయోజదళాక్షు శరణ్యఁజేయు మ
వ్వారిగ తల్పశైల నతవాంఛిత దాయకి రంగనాయకీ. 26

7. రంగపతీ శతకము.

జలనిధి నీదిరన్ నగముచాటునడాగిన భూమిమోసిరన్
బలిమి నృసింహమైన వటుభావముగన్నఁ బరశ్వధంబు గే
ల్తలముననఁబట్టిరన్ జడలు(1) దాల్చిన నాగలిబూన బుద్ధతన్
జెలగినఁ గల్కివైన నినుజిత్తమునన్ విడనాడ మాధవా
ప్రబలలితదేహ తల్పగిరి రంగపతి సుకృతీ కృపామతీ. 20

ఈ పద్యమున దశావతార ప్రశంసగలదు - శ్రీకృష్ణావతార స్మరణ యిందులేదు - బలరామ బుద్ధులున్నారు.

8. దండకములోని కొన్ని వాక్యములు.

నన్నున్ భవత్పాద పద్మాసనాసక్త చిత్తాత్మునింజేసి నీకింకర
శ్రేణిలోఁగూర్చి రక్షింపవే రంగనాథా ♦ ♦ ♦
పాలించు నారాయణా వేదపారాయణా రావె వైకుంఠవాసా
హారిమందహాసా శుభాకారభాసా నిజానందదాసా రమా
చిద్విలాసా నమస్తే - నమస్తే - నమస్తే - నమః.

9. రంగాష్టక స్తోత్రము.

భైరవి రాగము - జులువ తాళము

అండజాని వాహనం వేదండరాజ పాలనం
దండిదైత్య ఖండనం ప్రచండభీమ భండనం
కుంతలాది భూషణం కోదండరామ పోషణం
రాజతం నెల్లూరువాస రంగనాయకం భజే 8

10. పాటలు. (i) లాలిపాట.

ఎన్ని జగములనైన వేరెనీకన్న - ఎన్నంగ నధికులిక నెవరు లేరన్న
అన్నిటికిమూలమని యాదినేవిన్నా—మన్నించు మముగన్న మహితరంగన్నా-లాలి॥

(ii) మంగళహారతి - పంతువరాళి రాగం. ఆదితాళం.

మనమున ననుదిన - మునుగనుగొని - ఘనమని చనవున - తనువునొసంగితి
దాథై - ధత్తాం - తాహుఝుంత - తాహు జంత - తాంతక మంగళం.
మండిత కుండల గండస్థల కోదండరామ దా స్పండిత పోషణ
గామా - మాపా - గామాపామ - గామపామ - గారిస మంగళం.

(1) శ్రీరాముడు - రామాయణము అయోధ్యాకాండ - 52.58శ్లో చూడుము. (సశేషము)



# చిత్రాలు మహిమలు



న్యూఢిల్లీలో టర్కుమాన్ రోడ్డుమీద ఒక యింట్లో వింతయైన అగ్నిజ్వాలలు బయలుదేరినవి. ఇవి ఇంట్లోఉన్న వస్త్రములను మాత్రమే దహించుచున్నవి. బల్లమీద కప్పబడియున్న గుడ్డ తగులబడింది. కాని, ఆబల్లకు కించిత్తయినా నిప్పు అంటుకోలేదు. గోడమీదనున్న చిలుకకొయ్యకు తగిలించి ఉన్న బట్ట తగలబడింది. కాని చిలుకకొయ్యమాత్రం ఏమీ నిప్పంటుకోలేదు. యీరీతిగా యింటిలోని బట్టలుమాత్రము తగులబడుట ఇంటిలోఉన్న 10 సం॥ బాలిక చూచింది. మంటలు వెంటనే ఆర్పివేయబడెను. కాని కొద్దినిమిషములలోనే ఇతరగదులలోని బట్టలు నిప్పంటుకొనెను. ఇది ఏదైనా మంత్రప్రయోగమేమో యని భయపడి ఒక మంత్రశాస్త్రజ్ఞుని ఆ ఇంటివారు రప్పించిరి. అతడువచ్చి వెళ్లిన తర్వాత తిరిగి ఒక బట్టలమూట నిప్పంటుకొనెను. ఆ యింటిలోనివారు అరమైలు దూరములోనున్న మరొక యింటిలోనికి వెళ్లిరి. 'ఏ కొత్తయింటిలోనికి పిల్లలను చేర్పించిరో ఆ యింటిలో వారి పరుపులు నిప్పంటుకొనినట్లుగా వార్త వచ్చెను. 10 సం॥ బాలిక తాను కట్టుకొన్న గుడ్డలనుతీసి గోడకుతగిలించగా అవికూడా నిప్పంటుకొనెను. ఇందుకు కారణములు పలువురు పలువిధములుగా చెప్పుచున్నారు. ఇదంతా దయ్యముల దురాగతములని కొందరు అన్నారు. దీపావళికి టపాకాయలను కాల్చగా భాస్వరము (ఫాస్ఫరస్) ధూపము బట్టలమీద వ్యాపించెననియు అందువల్లనే యివి తగులబడుచున్నవనియు ఆధునిక శాస్త్రవేత్తలు సశాస్త్రీయముగా అర్థము చెప్పుచున్నారు.

◆ ◆ ◆

శ్రీమతి ఎస్. పద్మాబాయి త్రివేంద్రం కాపురస్తురాలు. ప్రస్తుతం ఆమె పశ్చిమ గోదావరి జిల్లా మలకపల్లి లోని ఐ. ఎల్. టి. డి. కంపెనీలో గుమాస్తాగా వుంటున్న తన అల్లుడు వి.వి. రామారావు ఇంట ఉంటున్నది. శ్రీరామభక్తురాలు. 15 రోజులక్రితం రాములవారు ఆమెకు కలలో కన్పించి తన దర్శనార్థం ఆమె భద్రాచలం రావలెననీ, లక్షసార్లు శ్రీరామనామ జపం చేయవలెననీ, తిరుపతి వేంకటేశ్వరస్వామికి ఆమె మొక్కుకున్న మొక్కుబడిని తానే స్వీకరింతుననీ, తానే వెంకన్న, వెంకన్నే తాను అనీ, ఆమెకు ముక్తిప్రసాదించెదననీ, మొక్కుబడి ముట్టినట్లు ఒక చిహ్నము వేసెదననీ చెప్పి అంతర్ధానమయారట. అప్పటినుంచీ ఆమె అహోరాత్రాలు శ్రీరామనామ స్మరణలో నిమగ్నమయ్యెనట.

దరిమిలా ఒక రోజున రాములవారు ఆమెను పూని, మొక్కుబడిని మూడు భాగాలుచేసి, ఒక వంతు తన కిమ్మనీ, ఒక వంతు తిరుపతి పంపమనీ, మూడో వంతు దాన ధర్మాలు చేయమనీ సెలవిచ్చారట.

లక్షనామజపం అయిన తర్వాత, ఆమె, కూతురు, అల్లుడు భద్రాచలం వెళ్లి స్థానిక ఐ. ఎల్. టి. డి. మేనేజరు పి. వి. కృష్ణయ్య గారింట బసచేశారు. ఆరోజు సాయంకాలం ఆమె ఆలయానికి పోయి దైవదర్శనం చేసుకొంటూండగా, శ్రీరామలీల కన్పించి క్షేత్రోపవాసం చేయమని చెప్పెనట. ఆ ప్రకారం ఆమె ఆరాత్రి ఉపవాసం ఉందట. రాత్రి సుమారు ఒంటిగంట వేళప్పుడు ఆమె కుడిచేతిమీద ఏదో కుట్టినట్లనిపించి చూసుకోగా చక్రాంకితం కనిపించిందట. వెంటనే పలువురు ఆ చక్రాన్ని చూశారు.

ఆ చక్రం చూడడానికి వందలాది ప్రజ వస్తున్నారు. భగవంతుడు తనకు మూడు మాసాలలో ముక్తి కలిగిస్తానని చెప్పాడని ఆమెఅన్నది.

◆ ◆ ◆

దక్షిణాఫ్రికాలో యువతీయువకు లిరువురు గాఢంగా ప్రేమించుకున్నారు. కాని పిల్ల తండ్రి యువకుడ్ని సింహంపాలు పితుక్కొనివస్తే పిల్లనిస్తానన్నాడట. ఆ యువకుడు యోగాభ్యాసి. యోగపటిమతో సింహాన్ని వలలోపట్టి - అది అరుస్తున్నా భయపడక 3 ఔన్సుల పాలు పిండుకొని వచ్చాడట. ఆపాలు పచ్చగా చిక్కగా ఉన్నాయట. తులసీదాసు పాము నాధారంచేసుకొని మేడనెక్కడం ఆశ్చర్యకరమా?

అరవదేశములో తెంకాసి అని ఒక క్షేత్రము. ఆ సమీపగ్రామంలో 11 సం|| బాలిక మూడు సం||లనుంచి మాటలేక మూగిగా ఉన్నది. ఆ బిడ్డను తండ్రి పిలుచుకొనివచ్చి తెంకాసి పరాశక్తి ఆలయంలో అమ్మవారి పీఠానికి ఎదురుగా కూచోపెట్టినాడు. కొంతకాలం అలాకూచోగా ఆ బిడ్డ ఉన్నట్టుండి తన పేరు 'మీనా' అని అరచింది; దేవిని స్తోత్రంచేస్తూ పాడ మొదలు పెట్టింది. అడిగితే గర్భాలయమునుండి దివ్యమంగళ విగ్రహంగల అమ్మణ్ణివచ్చి తన ఎదుటనిల్చి, పేరు చెప్పమని, పాట పాడమని అడిగింది-అన్నదట.

♦ ♦ ♦

కోయంబత్తూరిజిల్లాలో కన్నిముత్తుగౌండరు అనే ఆయనకు—తన 5 సం|| కుమారుణ్ణి గొంతుకోసేశాడని—జిల్లాజడ్జిగారు ఉరిశిక్షవేశారు.

## పోలీసువారి కేసు ఇది

ఒకరోజున గౌండరు తన తండ్రిని, తల్లిని, భార్యను, 3 గ్గురు బిడ్డలను వరసగా ముంగిట్లో నిలువమన్నాడు. కొన్ని తాటాకులు చేత బట్టుకొని వారికి ప్రదక్షిణంచేశాడు.. తండ్రిని మాదిగదానికి ఎరవిచ్చిన తమ "అరువాల్" (కొడవలి) తెమ్మన్నాడు. అతడువెళ్ళగానే—తనభార్యను "నిన్ను బలివేయవచ్చునా?" అని అడిగాడు. ఆమె "చిత్తము" అన్నది. తండ్రిరాగానే ఆయననూ అలాగేఅడిగాడు. ఆయన జంకగానే-తొలిగి నిలువమన్నాడు. కడపట నిలుచున్న చిన్నకొడుకు దగ్గరకువెళ్లి - తలనరికేశాడు.

## బంధువులసాక్ష్యము

కుటుంబంలో అందరియెడ చాలా దయగలవాడు. ఆరు నెలలనుంచి దేవాలయంలో ఉపాసన చేస్తున్నాడు. ఈ సంఘటనకు కొన్నిరోజులుముందు—పశువులను అమ్మివేశాడు. అప్పులు తీర్చాడు. ధాన్యం కూడా కొద్దిగా దానంధర్మం చేశాడు. ఉప్పులేని ఏకభుక్తం. తల్లివంకవారికి ఉన్మాదంకద్దు.

## డాక్టరుసాక్ష్యం

దేవుడు, మతము అనే విషయములలోతప్ప అతని హేతువాదము, విచక్షణజ్ఞానము, జ్ఞాపకశక్తి అన్ని సాధారణంగానే ఉన్నాయి. శివుడు తను తనకొడుకును బలి యివ్వమన్నాడనే దుర్భ్రమ అతనికుంది. అందుచేత ఒక విధమగు చిత్తవిభ్రమముతో బాధపడుతున్నాడు.

## ముద్దాయి వాఙ్మూలం

శివునిఆజ్ఞచే నాకొడుకుశిరస్సు ఛేదించాను. నా గురువు నా పినతండ్రి ఆత్మ ఈబాలునియందు ప్రవేశించిందనీ, ఈబాలుని సంహరిస్తే—నా పినతండ్రి పునర్జీవితుడవుతాడని—శివునాజ్ఞ.

♦ ♦ ♦

జపానులో 6 నెలల మగబిడ్డను ఆసుపత్రికి తీసుకొనివచ్చారు. బిడ్డ ఎదగడంలేదని చిక్కిపోతున్నాడని వారి దిగులు. డాక్టరు పరీక్షించాడు. లక్షణాలేమో గర్భచిహ్నెలు; కడుపులో గడ్డలేచిందేమో ఆపరేషన్ చేయుమని మరోడాక్టరు కప్పచెప్పాడు. ఆపరేషన్ చేయగా లోపల ఆరునెల్ల శిశుపిండమున్నది. తీసి మళ్లి కుట్టారు. ఇప్పుడసలు మగబిడ్డకు 11 నెలలు; వయస్సుకు తగినట్లు బలిసియున్నాడు. ఈ చిత్రమును డాక్టరు లెన్నడు కనివిని యెరుగరు; ఎప్పుడో ఆడబిడ్డ కొకదాని కిట్లైనట్లు మాత్రంవిన్నారట, మగపిల్లవాడికి కావడం మాత్రం చాలా ఆశ్చర్యకరమన్నారు. అయితే అసలెట్లా తటస్థించింది అని ఆలోచించారు. తల్లికి గర్భమైనప్పుడు-కవలపిండువు లేర్పడినవి. అయితే అవి పిండాకృతికి వచ్చేసరికి దేనికది విడివిడిగా వృద్ధిపొందవలసింది - ఒకదానిలో మరొకటి చొచ్చుకొని పోయింది. రెండు పిండాలకు తల్లి ఆహారమే - ధారకం. కాని బహిఃపిండము యధారీతి వృద్ధిపొందగా లోపిండము నాసిగా ఉండిపోయింది. శిశువు జన్మించిన తర్వాత లోపలిపిండం కూడా - శిశువు తీసుకొనే ఆహారమునుండే రక్తనాళములద్వారా ధారకం పొంది వృద్ధిపొందింది. దాంతో అసలు శిశువు క్షీణించ నారంభించింది. ఈ లోపలి పిండం - పిడికిలికిమించి ఉన్నదట. ఇంక కొన్నాళ్లు ఇల్లాగేఉంటే-పెద్దబిడ్డ చనిపోయి ఉండునట.




(గత సంచిక తరువాయి)

అక్కడ,

కుండిన నగరము మహా వైభవముగా !
మెండుగ వివాహ సన్నాహంబులతో
అలంకారముల నల రారుచు నుండెనుగా

వచనం॥

ఆ సమయమున

చేదీశుడు శిశుపాలకుండు వేగ
మోదంబున బెండ్లికి తర్లి వచ్చుచుండె
రుక్మిణీని శ్రీకృష్ణుడు వరియించె
రుక్మిణీని నా కొసగె బావ రుక్మి
కృష్ణున కవమానము గాజొచ్చెన్
కృష్ణుడు కడు మాయలు గలవాడు
పెండ్లిని తంత్రము జరుగగల దటంచు
వెను వెంటను చతురంగ బలంబులతో
బంధు మిత్ర పరివారమ్ములతో
గర్వమ్మున కుండిన నగరము జేరుకొనె
ఘనుడగు మా శిశుపాల ప్రభువునకే
కాంత రుక్మిణిని గావింతుము పెండ్లి
యాదవాధముని యాశ లుడుగ జేసి
మోదముగా గొని వత్తుము రుక్మిణిని

మిత్రం॥

అని దలకొని జరాసంధుడును
దంతవక్త్రుడును, సాళ్వ, విదూరక
పౌండ్రకాదు లతి రయమున కుండిన
లోన విడిసినారు ॥ తం ॥

శ్రీకృష్ణుం డొకడే కుండిన చనియుండె
శిశుపాలు బలమున నెందరో చనినారు
యుద్ధము తప్పదు రుక్మిణీని గొనగా
సిద్ధము గానె బయలుదేర వలయున్,

వచనం॥

అని బలరాముడు కొంత సైన్యముతో శ్రీకృష్ణుడు పోయిన మార్గమున వెంటనే బయలుదేరి పోయెను. వీరి సంగతట్లుండ నీయుడు. - రుక్మిణీ దేవి యే స్థితిలో నున్నదో గను గొందము.

మిగుల చింతలో దగిలెను రుక్మిణి
రేపే లగ్నము కృష్ణుడు రాలేదు
కోపము జెందెనో రాయబారమునకు
బ్రాహ్మణు డరిగెనో నిలిచి నాడో త్రోవన్?
బ్రహ్మ వ్రాత నాకెట్టి రీతి గలదో?
భార్యగాను నను కృష్ణుడు చేకొనునా?
పరాభవించునో ఫలితం బేమగునో? .
తల్లడిల్లుచును యుల్లము ఝల్లు మన
కన్నుల గారెడి నీరు దుడుచు కొనదు
అన్నమైన దా ముట్టుకొనగ జనదు
ఆభరణమ్ముల నలంకరించు కొనదు
చెలికత్తియలను పలుకరించ జనదు
తల్లికి తన తల పెరిగింపగ జనదు
తల్పముపై దన మేను వాల్ప జనదు
కృష్ణుడు రాగల మార్గము వెంబడినె
దృష్టిని నిలిపి భజియింపుచు నుండె;
వచ్చుచుండెను బ్రాహ్మణుండు మరలి

మిశ్రం॥

విప్ర వరుని వదనమ్మును గను
గొని తన కార్యము పండా కాయా యన్న
యాశతో వేగిర పాటున నెదురుగ బోవగ
రుక్మిణీని విసిగించక విప్రుడు తెలియ
జేసె నిటుల 'మెచ్చె' ॥తం॥

మెచ్చె నీదు సద్గుణమ్ములకు బిడ్డా!
వచ్చె సుదర్శనుండు మన వీటికి బిడ్డా!
నీ కోరిక దీరక గొనిపోవును బిడ్డా!
నీ భాగ్యం బెంతో ఫలియించెను బిడ్డా!
మిక్కుటముగ ధన మిచ్చె నాకు బిడ్డా!
మహానందమున రుక్మిణి పలికెను గా!
మాధవు డెంతో ధనంబు మీ కిచ్చెన్
మహాత్మ! నాగతి మాధవునకు దెలిపి
వెంట దెచ్చి నా ప్రాణంబులు నిలిపి
ప్రేమ గూర్చితివి ప్రత్యుపకారంబు
చేయజాల నా చేతు లెత్తు దాన
నమస్కార మిదె గైకొనుమీ తండ్రీ!
నమో యటంచును నమస్కార మొసగె.

వచనం॥

అచ్చట పురజను లందరు,

కృష్ణుడు వచ్చిన వార్తలు దెలిసికొని
కృష్ణుని జూడగ వెడలిరి రయమునను
గుంపు గుంపులుగ కృష్ణుని వీక్షించి
సొంపున కెంతో యబ్బురమును జెంది
ఈ కృష్ణుడు మా రుక్మిణి కే దగును
ఈ కృష్ణునకు రుక్మిణియే దగును
అయినను రుక్మిణి యధముండైనట్టు
శిశుపాలుని నిత్తరి జేకొనగా వలసె
బ్రహ్మ దేవు డీ విధము నెరుగ లేడా?
బ్రహ్మ దగల్పడె రుక్మిణి కృష్ణులకు
కూర్చును తప్పక నేర్పరి యా బ్రహ్మ
కూడ వలయు మా పుణ్య ఫలమునైన
ప్రజలీ విధమున బలికిరి దయతోడ

వచనం॥

పిమ్మట,

భటు లిరు వంకల బార్లు దీర్చి నడువ
వారకాంత లుపహారములను బట్ట
చెలికత్తెలు కడు జేరువగా నడువ [చుండ
విప్రాంగనలు బందుగురాండ్రు వెంటవచ్చు
రాజులు తమ తమ సేనలతో నడువ
రాజ కుమారిక రాచనగరు వీడి
ఊరి బైటగల గౌరీ యాలయమున్
జేరి గౌరిని బ్రార్థింపగ దొడగె
కన్నియ నమ్మా కరుణ గాంచు గౌరీ!
నిన్ను నమ్మిన వారి కేమి కొఱత!
నిన్నే నమ్మితి నన్ను దయను గనుమ!
పున్నె ముండు నా పురుషుని జేకూర్చు!
పతిగా కృష్ణునె ఒడయ జేయుమమ్మా!
మీ దాంపత్యము తీరుగాను దలచి
నా దాంపత్యము వెలయ జేయ వలయు
బిరాన బ్రోచి కాపాడగ వలయు
పురాణ దంపతులారా! వందనముల్.

వచనం॥

అని ప్రార్థించి గుడి వెలుపలకు వచ్చి,

వచ్చెనో లేదో కృష్ణు డచటి కనుచు,
జెచ్చెర కలయగ జూచెను నలు దెసలు.
నీల మేఘ శ్యామల సుకుమారు
లాలిత వయో వైభవ విలసితుని
గంభీర చతుర స్వరూపు శ్రీ కృష్ణున్
కనుగొని రుక్మిణి "సమయ మిదే సుండీ!
ఆలసింపకను గొనిపోవలసిన" దన్నటుల
వ్రాల్చక రెప్పలు నిలిపి చూచు చుండెన్.

కన్నులు మిఱుమిట్లు గొలుపు నట్లు
కన్నియ రూపము గాంచి రాజులెల్ల
చేష్టలుడిగి వీక్షింపుచు నుండగను
గుంపుగ నక్కలు భుజించుటకు గూడి
కూర్చుకొన్న యాహారం బంతయును
గంభీరముగా సింహము గైకొను చందమున
రమణి, రుక్మిణిని రథము నందు నుంచి
రమణీయముగా శంఖము బూరించి
బలరాముడు సేనలు వచ్చుచుండ వెంట

మిత్రం॥

శ్రీ కృష్ణుడుకడు సంరంభముగా
నిర్భయుంబుగా ద్వారక మార్గము
బట్టి పోవుచుండెన్ ॥తం॥

వాసు దేవుని సాహసమున కెంతో
ఆశ్చర్యంబున గాంచి రోషమొంది
జరా సంధాది రాజు లెల్ల
చక్రి తోడ యుద్ధంబు సలుపుటకును
సేనలతో నెదురించిరి గర్వమున
అద్భుతంబుగా జరిగె ఘోర రణము
అందరు రాజులు ఓడిరి రణమందు
సేనలతో వెను తిరిగి వెడలి నారు
శిశు పాలుడు తన యాలి పోయి నటుల
గోలు గోలున ఘోష బెట్టు చుండ
ప్రాణము లుండిన బ్రతుక వచ్చు చైద్యా!
బ్రతుకు కలిగిన భార్య గలదు చైద్యా!
పరితాపంబును చెంద వలదు చైద్యా!
వడిగా నిండ్లకు వెడలు దాము చైద్యా!

మిత్రం॥

అని జరాసంధాది రాజులు
శిశుపాలునితో తమ తమ రాజ్యమ్ములకు
వెడలి నారు ॥తం॥

మా సాటి వాడవోరీ!
మా బిడ్డను గొని చనగ!
ఏ పాటి వాడ వోరీ!
గోపాలక నిలు రోరీ!
మాన హీనుడవు వోరీ!
మర్యాద లెరుగ వోరీ!
బాలను విడ కున్న నీదు
ప్రాణము లివె గొందు నోరీ!
అని యొక్కుమ్మడి సైన్యమ్ముల తోను
ఆ శ్రీ కృష్ణుని ముట్టడించి రుక్మి
ఘోర యుద్ధమును చేయ సాగె నంత
పౌరుషమ్మున రుక్మి తలను దునుమ
మాధవుండు గమకించు సమయమందు
మానిని రుక్మిణి యడ్డు నిలిచి పలికె
మహాత్మ! నీదగు మహత్త్వ మెరుగకను
మా యన్న రుక్మి యపరాధము గావించె
మన్నింపుము దేవా! మాయన్నయైనరుక్మిన్
మాధవుండు మాయల్లు డయ్యె ననుచు
మదిలో బొంగెడి యత్త మామలకును



పుత్ర శోకమును బొందజేయ కయ్యా!
కరుణ జూపి వేగాపాడుము శౌరీ!
శాంత మానసము గాంచి కృష్ణుడంత
చంపక బావా! చను దెమ్మని పిలిచి
బంధించెను రుక్మికి బంధుండని గనక
తలయును మూతియు గొరిగెను రేవులుగా
తల దీయుట కంటెను వికృతమును జేసి
బంధింప బడిన రుక్మికి బలభద్రుండంత
బంధ ములను విడదీసి రుక్మిణితో
బాలా! వగవకు పరాభ వమ్మునకు
కృష్ణ మూర్తి కెగ్గాడ జూడకమ్మా!
గతమున జేసెడి కర్మ ఫలంబులను
ఎవరివి వారే యనుభ వించ వలెను.
ఎరింగి మదిలో దుర పిల్లకు మమ్మా!
రుక్మిణి వగచుట మానియుండె నంత
రుక్మి తనదు పరాభవము దలచి కొని
హాని గెలువక కుండిన కరుగ నని
ఆ ప్రాంతముననె దృఢ ప్రతిజ్ఞతో నిలిచె.

మిశ్రం॥

శ్రీ కృష్ణుడు తన బంధులు మెచ్చగ
సమస్త రాజుల బారగ ద్రోలి
సమ్మోదంబున రుక్మిణితోడను ద్వారక జేరి
నిండు ఖ్యాతిని పెండ్లి జేసికొనెను ॥తం॥

ఆది లక్ష్మియగు రుక్మిణితో గలసి
ఆది విష్ణుడా కృష్ణుడు విలసిల్ల
ఆనందంబును గాంచి రచటి ప్రజలు
శ్రీ రుక్మిణి వైవాహిక చరితంబు
చెలువు మీర వినియుండిన జదివినను
శ్రీ రుక్మిణీశు డగు శ్రీ కృష్ణుడు నిత్యంబు
కారుణ్యంబున గల్యాణము గూర్చున్.

సమాప్తము.




శ్రీమతి ఏంజలా లాధాం సుప్రసిద్ధ బ్రిటిష్ చిత్రకారిణి. ఈమె లండన్ మాార్లే కళాశాలలో, కుడ్యచిత్రశాఖలో అధ్యాపకురాలు. ప్రస్తుతం భారతదేశమంతా పర్యటనం చేస్తున్నారు. వివిధ ప్రాంతాలలో వున్న కుడ్యచిత్రాలను స్వయంగా పరిశీలించి, చిత్రణా విధానం, రంగులకలయిక వగైరా యావత్తు విషయాలూ తెలుసుకోవాలని ఆమె అభిలాష. ఈమెకు భారతీయ వేదాంతమన్నా, హిందూమతమన్నా కూడా చాలా ఔత్సుక్యంవున్నది. ఈమె ఒక పత్రికావిలేఖరితో ఇట్లన్నది:—

'పూర్వం మోస్తరుగానే, భారతీయ చిత్రకళలో తిరిగి ఒక స్వర్ణయుగం ప్రారంభం కాబోతున్నది. యాంత్రిక ప్రవర్తన క్రిందికి మారిపోయిన పాశ్చాత్య నాగరికతలోకి భారతీయ కళలలోని ఆధ్యాత్మికశక్తి ప్రవేశించకపోతే, స్త్రీ, పురుషులందరికీ త్వరలో పిచ్చెత్తిపోతుందని నాభయం. అలాంటి భారతీయ కళోపాసకులు వెంటనే మాకు లభించకపోతే, మానసిక చికిత్సావేత్తలను పిలువవలసిన అగత్యం తప్పనిసరిగా ఏర్పడుతుంది.

ఇప్పుడు మా పాఠశాలల గదులన్నిటిలోనూ గ్రీకు చిత్రాలున్నయ్. గ్రీకుకళను మేము బాగా జీర్ణించుకున్నాం. వీటికిప్రత్యామ్నాయా న్యాయంగా ఇప్పుడు భారతీయ చిత్రకళను సేకరించి, ఈ క్రొత్తకళలో అనుభవాన్ని గడించుకోవాలి.

భారత చిత్రకళ ఇప్పుడు విస్తృతంగా వ్యాప్తికావలసిన తరుణం వచ్చింది. సినిమాహాల్సులోనూ పురమందిరాలలోనూ, పాఠశాలల్లోనూ, వైద్యకేంద్రాలలోనూ, ఫ్యాక్టరీలలోనూ యెక్కడబడితే అక్కడ చిత్రాలను ప్రదర్శించి వుంచాలి.

దక్షిణ భారతంలో, ప్రపంచ మంతటిలోనూ అమూల్యములైన కుడ్య చిత్రాలున్నయ్. వీటినన్నిటినీ ప్రభుత్వపు వస్తుశాఖవారే రక్షించుతూ వుండడంముదావహం. కాని నేను ప్రభుత్వానికి, దేశంలోని కళాపోషకులకు ఒక్క విజ్ఞప్తిచేస్తున్నాను. దేశంలోని కళోపాసకులనందర్నీ నియోగించి, ఎంతో ప్రాచీనౌన్నత్యంగల యీ మహాకళను పునరుద్ధరించటానికి తీవ్రంగా కృషిచేయాలి. తార్కాణానికి, ఈ మద్రాసు విమానకేంద్రాన్ని తీసుకోండి. ఇక్కడ కుడ్యచిత్రాలనూ, శిల్పాలనూ స్థానికకళాకారులచేత తయారుచేయించి నెలకొల్పితే యెంతో బాగుంటుంది. వివిధదేశాల ప్రయాణీకులకూ భారత సాంప్రదాయాన్ని తెలుసుకోవటానికి అవకాశంగా వుంటుంది!

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ అధ్యక్షురాలు, శ్రీమతి కొండ పార్వతీదేవిగారు, ఆంధ్రదేశ పర్యటనచేస్తూ విశాఖపట్నం వుమెన్స్ ఇండియన్ అసోసియేషన్ ఆధ్వర్యాన, శ్రీమతి అంకితం రమాదేవిగారి అధ్యక్షతను జరిగిన స్త్రీల బహిరంగసభలో స్త్రీ సమాజాల నిర్వహణవిధానాన్ని గురించి ఇలా ప్రసంగించారు :-

అనేకచోట్ల స్త్రీ సమాజాలలో కూడా కనబడుతున్న అసహనాభావాలను, స్వార్థచింతను నిరసిస్తున్నాను. సమాజాల అభివృద్ధికి సంఘీభావం అత్యవసరము. ప్రతి సమాజం, ఏదోఒక నిర్మాణ కార్య

క్రమాన్ని కొనసాగించాలి. సహకారసంఘాల నిర్వహణ వయోజన విద్యాబోధ, శిశుపోషణాలయాల నిర్వహణ, మాంటిసోరియన్ పద్ధతులపై పసిపాపల పాఠశాలల నిర్వహణ, నూలువడుకుట, మున్నగు పనులకు పూనుకోవడం మంచిది.

మనస్తత్వంలో మార్పు రావడం అత్యంతముఖ్యము. సేవాధర్మములో నూతనవిలువల గుర్తించాలి, పౌరధర్మాలను గుర్తించి వాటిని అమలుజరపాలి. మూఢత్వంలో ఉన్న జనసామాన్యాన్ని విజ్ఞానవంతులనుగా చెయ్యాలి. వయోజన వోటువల్ల సంపూర్ణ ప్రయోజనం కలగాలంటే వయోజనులందరు విజ్ఞానవంతులు కావాలి.

**వేపేరిలోని సెంట్ క్రిస్టోఫర్ ట్రెయినింగ్ కాలేజిలో విద్యార్థినులకుపన్యసించుచు మద్రాసు విద్యాశాఖా కార్యదర్శి శ్రీ లోబో ప్రభువు ఇట్లు చెప్పినారు :—**

ప్రస్తుతం స్త్రీలు ఇంటా బయటాకూడా తమ అధికారాన్ని చెలాయించగలుగుచున్నారు. అయినా ఉత్తరదేశంలో ఇంకా చాలామంది పరదాచాటున ఘోషా అనుభవించుచున్నారు. ఇతర ప్రాంతాలలో మరోవిధంగా ప్రత్యేకంగా ఉంచబడుతున్నారు. ఈ విషయంలో మద్రాసు రాజధాని మెరుగు; ముఖ్యంగా ఇక్కడ చదువుకున్న ఆడవాళ్లు హెచ్చు. కాబట్టి తమ తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు వినియోగించి నూతనాశయములను సాధించవలసిన బాధ్యత ఈ మద్రాసు స్త్రీలపై ఉన్నది. తమకన్న తక్కువస్థితిలో ఉన్న సోదరీమణులనుద్ధరించి పురుషులలో సరిసమానులనుగావింపవలసిన బాధ్యత కొంత వారిపైననేయున్నది. రాజకీయంగా వారికికలిగిన ఓటుహక్కునున్నూ, క్రొత్తరాజ్యాంగచట్టంలో . సరిసమానస్థాయీనున్నూ వారు సద్వినియోగంచేయాలి. సామాన్య జీవితంలో కళాకాంతులు ఏర్పడడానికి స్త్రీ లెంతో పని చేయగలరు.



# కుప్పమ్మ—కమలమ్మ కథ

।।। తందనానా తాన తానందనానా, తందనానానాన తందానతాన ।।।

కుండలాలావారి కుప్పమ్మ ఒకనాడు, పనిబడీవచ్చింది పక్కింటివేపు
కడుపునొప్పితోటి కమలమ్మ పక్కపై, కళ్లనీళ్లకంగ కారుస్తవుంటే
ఎందుకే ఓకమల ఎందుకే ఏడుస్త, ఏమి బాధో చెప్పి ఏడ్వమన్నాది.

కడుపునొప్పితోటి కడగండ్లు బడుతూంటె, ఎగతాళి గిగతాళి ఇప్పుడా నీకు
అబ్బ యీ బాధ నీకబ్బినక్లైతే, యీమాయలన్నీని ఎగిరిపొయ్యేని

చూసిపొయ్యేవారు చెబుతారుగాని, బాధసంగతివారి బాబుయిన్నాడా
కమలమ్మయీలాగు కళ్లెఱ్ఱజేసి, దడదడాతిట్టంగ తడబాటులేక

కుప్పమ్మ అన్నాది కొంపేమిమునిగింది, లోధ్రబుడ్డీ తాగలేకపొయ్యావా
మందులన్నీతాగి మతిచెదరిపోయింది, లోధ్ర గీధ్రావద్దు లోకమేవద్దు

అని లోధ్రవినయాన అపనిందలాడంగ, కోపగించూకోని కుప్పమ్మ అపుడు
తానుతొందరగాను తనయింటికెళ్లీ, లోధ్రకొంచము తెచ్చి లోటాలొబోసి

కమలమ్మవద్దంటె కనికరంలేక, తానుబలవంతాన తాగించినాది.
అదియేమిచిత్రమో ఆదేవుడెరుగు, దానిలోగుట్టేమొ ధన్వంతరెరుగు

పడకపై మెత్తంగపడి రాగమెడుతూన్న, కమలమ్మ మొగమంత కళలు దేరింది
ఒక్కఎదుటున లేచి పక్కపైనుండి, కౌగలించుకోని కుప్పమ్మనపుడు

ఏమిటేకుప్పమ్మ ఏటివుందేయిదీ, మన్నించవేతప్పు మరియిట్లగననే
అనియిట్లువేడంగ అతిదీనముగనూ, కుప్పమ్మ బిరబిరా చెప్పసాగింది

ఆసముద్రములోన అమృతంబువల్లె, కేసరికుటీరమున పూసింది లోధ్ర
ఆడవారిబాధలన్ని పోగొట్టుటకు, ధన్వంతరేవచ్చి ధరనిలిపినాడు

లోధ్రపొందురకీర్తి లోకమంతానిండి, జనులకందరికీని జ్యోతినిచ్చింది
ముట్టుకుట్టులమాన్పి, పొట్టనొప్పులజీల్చి, నడుమునొప్పులగర్వ మడగించుతాది.

ముట్టుసరిగారాక మొత్తుకుంటూఉన్న, ముదితలందరికీని మోదమిస్తాది.
అశ్వత్థవృక్షాల గిశ్వత్థవృక్షాల, చుట్టుముట్టూతిరిగి చీకాకుపొంది

బిడ్డగిడ్డాలేక బేలయ్యెయేడ్చేటి, ముసలికైనాయిచ్చు ముద్దుబిడ్డలను
గర్భకోశములోని గండాలుపోగొట్టి, సంతానమూనిచ్చు సౌభాగ్యమిచ్చు

ఎందుకింతాగొడవ ఎక్కువేందుకుకమల, దాన్నిమించినమందు ధాత్రిలోలేదు
అదిస్త్రీలపాలిటీ ఆకామధేనువే, అదిస్త్రీలపాలిటీ ఆకల్పతరువే

ఇదివినీకమలమ్మ యింతవరకూచాన్ని, తాగనందుకు చాల వగచెందితనలోన
ఇకముందునైనాను లోధ్రతాగాలనీ, ఘట్టిగా ఓపెద్ద ఒట్టెట్టుకుంది.

।।। ఈమందు అన్ని మందులషాపులలోను దొరకును. ।।।







**శ్రీమతి**

## పరణం సత్యవతీదేవిగారు బి.ఏ.

స్త్రీ అబల, అస్వతంత్ర, అవివేకి అనే అభిప్రాయంతో మాట్లాడే వారిప్పటికీ, ఈనాడుగూడ కన్పిస్తూనేయున్నారు. ప్రతివానికి స్త్రీయంటే చులకన అయిపోయింది. మనమువారెన్ని చేష్టలుచేసినా, కండ్లుఒప్పచెప్పి చూస్తూ వూరుకోవల్సిందేగాని, ప్రతిఘటించడానికి తగినశక్తిలేదనే యభిప్రాయంతో ఉన్నవారు నేటికీ ఉన్నారు. వీరీ అభిప్రాయంతోనే ఆడజాతిని అలమటించేట్లు చేస్తున్నారు. కళాశాలలలో చదువుతున్న విద్యార్థినుల స్థితిగతులు, వారికి జరుగుతున్న అమర్యాదలు ఒక్కసారి స్మృతిపథంలోకి దెచ్చుకోండి. స్త్రీ అబల అనే అభిప్రాయంతో మొగజాతి స్త్రీకి ఎంత అమర్యాద చేస్తున్నారో ఎంత చులకన చేస్తున్నారో అవగాహనం అవుతుంది.

సామాన్యంగా కళాశాలలోగాని, బయటగాని జరిగే సంఘటనలలో కొన్నిటిని ఇక్కడ ఉదహరిస్తాను. పదిమంది జట్టుగాగలిసి పోతున్న ఆడవారిని, వెంబడిచే పురుషు లిద్దరైనప్పటికి గోలచేయటం తప్పదు. అనేక రీతుల ఎగతాళి మాటలు చులకనా ప్రారంభిస్తారు. ఏ ఆడది పోతున్నా, మొగవానికి పుట్టే రోగమిదే. ఈ హాస్యమైన మాటలను, ఎగతాళిని కంటూవింటూ, ఊరుకోవాల్సిందే మొరిగే కుక్కలు కరవవు అని అనుకొని, శాంతంగా, మౌనంగా ఊరుకున్నంతవరకు వీరిచేష్టలు తగ్గురూపం పట్టవు. ఎవరికైనా తగిన శాస్తి జరిగితేగాని బుద్ధిరాదు. దబాయించి నాల్గుమాటలు మాట్లాడే మోతిరిగి మనజోలికిరారు. మొరగటంగూడమానేస్తారు. స్త్రీ అబల అనుకుని ఎవరిముందైనా ప్రవర్తించగూడదు. స్త్రీకున్నబలం స్త్రీకి ఉంది. తన అవమానంజరిగే టప్పుడుగూడ స్త్రీ మౌనంగ కూర్చోవటం, మంచిదిగాదు ఉత్తర హిందూస్థానంలో లెక్కకు మిక్కిలిగా స్త్రీలు బలవంతంగా కరకు తురకల హస్తాల్లో అలమటించి నలిగిపోయి చెరచబడటానికి కారణము, స్త్రీ తన ప్రతిఘటనాశక్తిని ప్రదర్శించక మౌనంగా ఊరుకోవటమే. ప్రతిఘటించి తన బలాన్ని ప్రదర్శించే పక్షంలో ఈగగూడ స్త్రీ జోలికి రాలేదు. స్త్రీ అబలగా ఉండరాదు. రాజపుత్రరాణులు తమభర్తలను కృత్రిమంగాజంపి తమమీదకు దండెత్తే మహమ్మదీయులను ఏంజేసేవారు? అధైర్యపడక కత్తిపట్టి వారిముందు నిల్చుని ప్రతిఘటించేవారు. వీలైతే వారిని తునుమాడటమో లేక తామే ప్రాయోపవేశము చేయటమో జరిగేటట్లు చూశేవారు. ఝాన్సీలక్ష్మిబాయి ఏంజేసింది. ఆంగ్లేయులంతటి వారిని ఎదిరించలేదూ? రాణిసంయుక్త మేవాడ్ రాణీ, పౌరాణికయుగంలోని సత్యభామ, కైకేయి, ద్రౌపది మున్నగు వారు కత్తిపట్టి యుద్ధం చేయలేదు! వారు అబలలు అనిపించుకొన్నారా? లేదు? ఆప్రతిఘటనాశక్తిని మనస్త్రీలు నేర్చుకోవాలి, వారిలాంటి యువతు లనిపించుకోవాలి,

స్త్రీ అస్వతంత్ర-స్వతంత్రించి తానే పనికి పూనుకుంటానికి అవకాశంలేదు. Freedom is my birth right అన్న లోకమాన్యతిలక్ మహాశయుని పవిత్ర వాక్కుని గుర్తుకు దెచ్చుకోండి. స్వాతంత్ర్యము ఒక్క పురుషుని సొత్తేగాదు. స్త్రీ సొమ్ముగూడ. కాని స్వాతంత్ర్యమంటే భిన్నంగా అర్థం చేసుకొని మితిమీరి ప్రవర్తించటం స్త్రీకి పురుషునికి ఇద్దరికీ మంచిదిగాదు. స్త్రీ కేవలం అస్వతంత్ర అన్న భావంతో పురుషు డామెపై లేనిపోని అధికారం మితిమీరి చలాయించటం జరుగుతుంది. స్త్రీని చిన్నతనంలో తల్లి, యవ్వనంలో భర్త, వార్ధక్యంలో పుత్రులు జాగ్రత్తగా కాపాడుతుంటారు. వీరు మంచి గుణగణాలు కలవారైతే బాధ వుండదు. కాని చెడు ప్రవర్తనకులోనై స్త్రీని నానావిధాల బాధ పెట్టుతూంటే తానస్వతంత్రయని ఊరుకోవటం మంచిదా? కాదు. ధిక్కరించే అధికారం ఉండాలి. వారు పోయినా తనకు జీవనోపాధిని సంపాదించుకొనే శక్తిమంతురాలు కావాలి. అందుకై ఆమెకు స్వాతంత్ర్య ముండాలి. ఎప్పుడైతే ఆమెకు ధీరత్వ ముండదో, ఆనాడే పురుషుడు ఆమెను పంజరంలో చిలుకను బాధించునట్లు కష్టాలకులోను చేస్తాడు. కాని తాను స్వతంత్ర అయితే ఉభయులకు ఎట్టికష్టాలుండవు. పూర్వపు రోజులలో స్త్రీకి స్వాతంత్ర్యమంత అవసరముండేదికాదు. కాని, యీనాటి దుర్గుణాలకు పాలవుతూ స్త్రీలను అనవసరంగా బాధలుపెట్టే పురుషులు అధికమవుతున్నారు. కనుక స్త్రీకి స్వాతంత్ర్యము కావల్సి వచ్చింది. స్త్రీ అస్వతంత్ర కాకూడదు.

స్త్రీ అవివేకి. ఇలా అంటానికి కారణం స్త్రీకి తగిన విద్యాభ్యాసము లేక పోవటమే. జ్ఞానసముపార్జనకు విద్య ప్రతివానికి అవసరం. విద్యావిహీనుని ద్విపాదపశువుగా పరిగణిస్తారు. కనుక విద్య పురుషులకేగాదు స్త్రీకిగూడ అవసరమే. ఉద్యోగాలు చేయబోతారా! అధికారాలు చెలాయిస్తారనా స్త్రీకి విద్యయవసరం అనుకుంటారేగాని విజ్ఞానంకోసం స్త్రీకి విద్యయవసరమని ఎవ్వరూ తలంచరు. స్త్రీకి గూడ వివేకం, జ్ఞానం, శూరత్వము, రాజకీయ దురంధరత్వమూ ఉన్నవికాని ఆమెకున్న అగుణాలను తనలోనే గుప్తపరచుకోవాలసివస్తున్నది; బహిర్గతంచేసి, అందరి పొగడ్తలను పొందటానికి వీలులేకుండపోయింది. స్త్రీ అవివేకి అన్న భావంతో ఆమెను ఎచ్చటకు పోనీయరు. (పేరంటాలకుతప్ప) దేశసౌభాగ్య విషయాలలో జోక్యం కలుగజేసుకోనీయరు. పైగా దేశసేవచేసే స్త్రీలను చూస్తే హేళన. విజయలక్ష్మీపండిట్ రాజకీయ దురంధరత్వము మనము చవిచూడటంలా. సరోజినీ నాయుడు గవర్నరై ప్రజాపాలన చేయలేదా? పూర్వం అహల్యాబాయి రాజ్యమేలలా! ఎంత మంది స్త్రీలు మంత్రిణులై రాజ్యపాలన గావించటం లేదు. వీరంతా అవివేకులా! స్త్రీ అవివేకికాదు. తగిన అవకాశాలు ప్రోత్సాహం లేకపోవుటచేతనే ఆమె వివేకము అందరికి తెలిసి రావటంలేదు. స్త్రీ అబల, అస్వతంత్ర అవివేకి అన్న పదాలు అర్థవిహీనమైనవి. ఇంకా శోధనచేస్తే స్త్రీ ఎంతటి సాహసవంతురాలో, ధీమంతురాలో మనకు అవగాహనం అవుతుంది.



# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యన్. కేసరి.

## జమాబంది

నాకు తెలియకమునుపే మా వూరిలో (ఇనమనమెళ్లూరు) యుండిన తాలూకా కచ్చేరిని వంగవోలుకు మార్చిరి. కచ్చేరి యుండినప్పుడు మా వూరుకూడ పేరు ప్రతిష్టలతో యుండినదట. నేను కుఱ్ఱవాడనుగనున్నప్పుడు మా వూరికి కలక్టర్లు సబు కలక్టర్లు మొదలగు తెల్లదొరలు జమాబందికి వచ్చుచుండిరి. జమాబంది అంటే ప్రతి సం॥మున్ను రెవిన్యూలెఖలను తనిఖీ చేయుట. వారు మా వూరికివచ్చుటకు ముందు రోజున వంగవోలునుండి ఒక బిళ్లబంట్రోతు గ్రామమునకు వచ్చి గ్రామకరణముగు ఇనమనమెళ్లూరి రాంభొట్లుగారిని, గ్రామమునసపు వాకా రామిరెడ్డిగారిని చూచి దొరగారు రేపు ఈ వూరికి మకాంవేసుకొని వచ్చుచున్నారని చెప్పును. ఈ మాటను వినినవెంటనే వీరిరువురు గ్రామ ముదామును పిలువనంపి మాలపల్లెలోయుండు వెట్టివార్లను పిలిపింతురు. గ్రామనౌకర్లను పాడుపడియుండిన పాతకచ్చేరి సావడిని వూడ్చి నీళ్లు చల్లమని చెప్పుదురు. గ్రామచాకలిని దివిటీతోకూడ సావడివద్ద సిద్ధముగ నుండవలయునని వుత్తరువు చేయుదురు. కుమ్మరికికూడ కబురు పంపుదురు. ఆ రాత్రి యంతయు కరణముగారికిని మునసబుగారికిని నిదురపట్టెడిదికాదు. తెల్లవారగనే లేచి మంగలి బాపిగాడిని పిలువనంపి క్షౌరమును చేయించుకొందురు. మాలమాదిగలకు కబురు పంపి తప్పెటలను, తాషామార్ఫములను, బూరగలను తయారుచేయుదురు. మంగల బాపిగాడిని దూదేకుల హుసేన్ సాహేబును పిలిపించి మేళమును సిద్ధము చేయమందురు. గ్రామములో పలుకుబడిగల ఆలపాటి పెదవీరాస్వామి, చినవీరాస్వామి, వెంకటస్వామి మొదలగు శెట్లకును, వాకా రామిరెడ్డి వీరారెడ్డి, లచ్చారెడ్డి మొదలగు రెడ్డి బృందమునకును, ఇనుమనమెళ్లూరి నల్ల సుబ్బయ్య యెఱ్ఱసుబ్బయ్య, రామస్వామి, క్రిష్ణస్వామి, మీనయ్య మొదలగు నియోగులుకును, బడిపంతులు పిచ్చయ్య, సంబివరాహాచార్యులు తంబళ పున్నయ్య అను దేవాలయముల అర్చకులకును, వేదాధ్యయనాది పండితోత్తములగు కొరవి, బుద్ధవరపు వార్లకును వీరందరకును కలక్టరురాకను తెలియపరుతురు. మా వూరిలో సుమారు 40, 50 బ్రాహ్మణ కుటుంబములుండెడివి. వైష్ణవులలో ఉప్పలవారు మంచి భూస్వాములుగనుండిరి.

వీరందరు కూడా తెల్లవారగానే గుండ్లకమ్మ యేటిలో స్నానమునుచేసి వైదిక కర్మలను తీర్చుకొని విభూతి రేఖలతోను పంగనామములతోను పింజబోసిన ధోవతులతోను దొరగారి దర్శనమునకు వేచియుండెదరు.

దొరగారు ఉదయమున వంగవోలులో కాఫీని పుచ్చుకొని దొరసాని సమేతముగ రెండెద్దుల పెట్టెబండినెక్కి సుమారు రెండుగంటల కాలములో మా వూరు చేరేవారు. మా వూరువంగవోలుకు 7 మైళ్ళదూరమేగనుక 9 గంటలలోపుగనే వూరికి వచ్చేవారు. ఆ నాడు వూరంతయు పిల్లజల్లలతో కోలాహలముగ నుండెడిది. ముతక చీరలతో రెడ్డిపడుచులును రంగుచీరలతో బ్రాహ్మణ ముత్తయిదువలును అక్కడ చేరేవారు.

దొరగారు వచ్చులోపల తప్పెటలను మంటకు కాచుకొని, కాళ్లకు గజ్జెలను కట్టుకొని చిందులను త్రొక్కుచు మాలవారు సిద్ధముగనుండెదరు. బ్రాహ్మణులు మాత్రము మాలమాదిగలకు దూరముగ నిలుచుండెదరు. మా వూరి దేవాలయ మాన్యముల ననుభవించుచుండు భోగమువారు చెదలవాడనుండివచ్చి ఆటపాటలను సలుపుచుండిరి. వీరిని ఆదరించి అన్నమునుపెట్టు పెద్దమనుష్యులు గ్రామములో చాల మందియుండిరి. ఆ నాడు మా వూరు పార్వేట పండుగ వైభవముతో నుండెడిది.

మా వూరి గ్రామకరణము తెలివిగల మంచిముసద్దీ. మంచి మేనిచాయగలిగిన భారీవిగ్రహము, బట్టతల, పెద్దబొజ్జగలిగిన మంచిమాటకారి. ఊరివారందరికి వీరిని చూచిన భయము, భక్తియుండినది. గ్రామమునసబు నిరక్షరకుక్షి అయినను తనచేవ్రాలు చేయుటకుమాత్రము నేర్చుకొని యుండెను. కలక్టరుగారు గ్రామములో ప్రవేశించుటకు పూర్వమే కరణముగారు పాతలెఖలను సవరించుకొని పాతదస్తరమును మార్చుకొని లెఖలతనిఖీకి సిద్ధముగనుందురు. ముందుగవచ్చిన బిళ్లబంట్రోతులు గ్రామముమీదపడి దొరగారికి కోళ్లను, మేకలను, గ్రుడ్లను సేకరించుకొనెదరు. వంగవోలునుండి మంచి బ్రాందిబుడ్లను తెప్పించి వుంచెదరు.

జనులందరు నడివీధిలో నిలుచుని దొరగారిరాకకు నిరీక్షించుచుండు సమయమున ముందుపోయిన ముదామువచ్చి దొరగారిబండి వచ్చుచున్నదని చెప్పును. అప్పుడు భజంత్రీలు మేళమును, మాదిగవాండ్లు తప్పెటలను వాయించెదరు. భోగమువారు కాళ్లగజ్జలతో సందడిచేసెదరు. తక్కినవారు నడుములకు గుడ్డలుచుట్టుకొని చేతులు కట్టుకొని వేచియుందురు.

దొరగారు వచ్చుపెట్టెబండిని కరణంగారు ఫర్లాంగు దూరమునచూచి గడగడ వణకుచు ఊడిపోవు గోచిని సవరించుకొనుచుండును. బట్టతలపైనుండు గువ్వకన్ను

తలగుడ్డపక్కకు జారుచుండును. కట్టుకున్న పాలచంగావి ధోవతి వీడిపోవుచుండును. రొండినవుండిన పొడిబుడ్డి క్రిందపడును. ఈ సమయమున దొరగారు దొరసానిగారు బండిదిగుదురు. వెంటనే వీరందరు ఆ దంపతులకు రెండుచేతులతో సలాములు పెట్టెదరు. అంత మేళతాళములతోకూడ భోగమువారితో వూరేగుతు పాతకచ్చేరి సావడికి బసకు పోయెదరు. వెనుకనుండివచ్చు రెండెద్దుల బండిలో వడకకుర్చీలు, స్నానము చేయుటకు తొట్టి, కక్కసుకు పోవుక మోడులు (మలవిసర్జన పింగాణిగిన్నెలు) మొదలగు సామానులన్నియు దిగును. కూడవచ్చిన బట్లరు (వంటవాడు) వంటకుకావలసిన సామగ్రి నంతయు సరిచూచుకొని భోజనమును తయారుచేయును. దొరగారితో కూడవచ్చిన క్యాంపుక్లర్కు (Camp clerk) లకు మామూళ్లను చెల్లించి వారికి భోజనవసతికి యేర్పాటు చేయుదురు. మరునటిరోజున తెల్లవారి కాఫీపుచ్చుకొనినపిమ్మట దొరసానితోకూడ దొరగారు తుపాకిని చేతపట్టుకొని వేటకు బైలుదేరును. మొదట వూరిలోకిపోయి అక్కడక్కడ తిరుగుచుండిన పందులను కాల్చిచంపును. దెబ్బతగిలి క్రిందపడి కీచుకీచుమని అరచి ప్రాణమును విడుచు పందినిచూచి ప్రక్కనున్న దొరసాని దొరగారి శూరత్వమునకు మెచ్చుకొనుచు చేతులనుతట్టి సంతోషించుచుండును. చనిపోయిన పందుల కామందులువచ్చి యేడ్చుచు పందులను ఈడ్చుకొని యింటికి పోవుచుండిరి. పిమ్మట యేటివడ్డున వుండిన నేరేడుతోపులోనికి పోయి చెట్లమీద హాయిగ విహరించుచుండిన రంగురంగు పక్షులనుకాల్చి నేలకూల్చును. క్రిందపడిన పక్షులను యేరి దొరసాని సంచిలో వేసుకొని పోవును. ఈ వేటకు కరణం మునసబు గార్లు ముందునడుచుచు దోవ తీయుచుందురు. వేటఅయినపిమ్మట దొరగారు బసకువెళ్లి భోజనానంతరము విశ్రమించిన పిమ్మట కరిణీకపులెఖల తనిఖీ ప్రారంభమగును. ఈ జమాబందికి చుట్టుప్రక్కలయుండు గ్రామకరణాలుకూడ లెఖలను తీసుకొని ఈ వూరికి వచ్చెదరు. గనుక ఈ లెఖలతనిఖీ ఈ వూరిలో కొన్నిదినములవరకు జరుగును. కలక్టరు క్యాంపు ఈ వూరిలో యుండునప్పుడు కలక్టరుసిబ్బంది వూర్లమీదపడి సంపాదించుకొను చుండిరి. చెదలవాడనుండి వచ్చిన భోగమువారుకూడ కరణాలను ఆశ్రయించుకొని యిక్కడనే యుండెదరు.

జమాబందికి వచ్చిన కరణాలందరు నామేనమామ ములుకుట్ల మహాదేవయ్యగారింట బసచేయుచుండిరి. ఈ కరణాలందరికి వంతుప్రకారము ఆలపాటి చినవీరాస్వామి శెట్టిగారు పొత్తరలను (భోజనసామగ్రిని) పంపుచుండిరి. మనిషికి తవ్వెడు చేరెడు బియ్యమును, గిద్దెడు ముడిపెసలును, చిన్ననిమ్మకాయంత చింతపండును, అరగిద్ద వుప్పును, పిడికెడు మిరపకాయలను, చిన్నచిట్టెడు సిద్దెనెయ్యిని పంపుచుండిరి. ఊరిలో

యుండు గొల్లలు ముంతెడు గొర్ల పెరుగును పంపుచుండిరి. ఈ భోజనసామగ్రితో మా అత్తగారు ముడిపెసల ముద్దపప్పును, ఇంటిలోయుండిన వంగవరుగు ధప్పళమును, చింత తొక్కు పచ్చడిని తయారుచేసి భోజనమును పెట్టుచుండినది. ఆ దినమున వారింట వరి అన్నముగనుక మామగారు నన్నుకూడ భోజనమునకు పిలిచేవారు. భోజనానంతర మున కరణాలందరు వీధిపంచలో కూర్చుని ఘాటయిన పాటిపొగాకు చుట్టలను పీల్చిన పిమ్మట చెంబెడు నీళ్లనుత్రాగి నులకమంచముల పైన పరుండి గాఢనిద్రను పోయ్యేవారు. ఆ కాలపుకరణాలు మంచి తిండిపుష్టిని, కండపుష్టిని కలిగిన భారీవారగుటవలన శెట్టిగారు పంపిన తవ్వెడు చేరుడుబియ్యపు అన్నము వీరికి చాలీచాలక యుండెడిది. వీరందరు అద్దంకి అయ్యవార్లంగారి ముద్దరను వేసుకొనిన శిష్యవర్గమునకు చేరిన వారగుటవలన వైష్ణవ సాంప్రదాయముల ననుసరించి దినచర్యను జరుపుచుండిరి. దట్టమైన తిరుమణీ శ్రీ చూర్ణములను ధరించుచుండిరి. తులసిపూసల దండలను తామరపూసల దండలను త్రిప్పుచుండిరి. చుట్టలను కాల్చుచుండిరి. నస్యమును పీల్చుచుండిరి. పలుమారు కోర్టుల కెక్కుచు రైతులను ఆశ్రయించి వ్యవహారములను పెంచి పేచీలను పెట్టి నేర్పుగ ప్రయివేటును చేయుచు పొట్ట పోసుకొనుచుండిరి.

పొరుగూర్లనుండివచ్చిన ఈ కరణాలందరు జమాబందిని ముగించుకొని వూర్లకు పోవునపుడు - "అబ్బాయి నీవు శెనగపప్పును కొనుక్కో"మని తలా ఒక కాణీడబ్బును నా చేతిలోపెట్టి పోవుచుండిరి. అప్పటినుండి మరల వీరు మామయ్య ఇంటికి యెప్పుడు వచ్చెదరా అని నేను వీరిరాకకు యెదురుచూచు చుండెడివాడను.



# గృహలక్ష్మి ఏజంట్లు:

—(★)—

గుంటూరు: వెల్‌కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడరన్ న్యూసు ఏజన్సి.
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందరరామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
పిఠాపురము: యం. సూరరాజు. .
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
బరంపురం : కె.వి.రంగారావు.
విశాఖపట్నం : సిటి న్యూస్ ఏజన్సి.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.
కడప : వై. వి. సుబ్బారావు.
గుత్తి: వి. హనుమంతాచార్.
భీమవరం: యన్. సూర్యనారాయణ.
తెనాలి : కృష్ణమోహన్ & కో.,
గుడివాడ : కృష్ణమోహన్ & కో.,

పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజీపేట: పి. రామమూర్తి.
చికాకోలు: బి. యన్. మూర్తి.
ఖర్గపూరు: యస్. ఆర్. నాయుడు.
పార్వతీపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాల్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
విశాఖపట్నము : ,, ,,
జగత్యాల: కాసం శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
బాపట్ల: అత్రివాణి న్యూస్ ఏజన్సి.
జంషెడ్‌పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి. గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
చోడవరం : పి. విశ్వేశ్వరరావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ
పుత్తూరు : ఎ. యస్. ఎ. అయ్యర్.
గణపవరం : ఆర్. సుబ్బారావు.
కొడవలూరు : జి. వీరరాఘవులు.
కూచిపూడి . జి. సీతారామయ్య.
వేలూరు : ఎ. వి. శాస్త్రి

హిగిన్‌బాతమ్ స్టాలులవద్ద దొరకును.

 ఇతరచోట్లను ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తుపంపుకొనుడు.



# గృహలక్ష్మికి పద్యరత్నములు



శ్రీ కల్లూరు అహోబలరావు

వెల్లుల్లిని బాదామిని చల్లని గోక్షీరమందు శర్కరతోడన్
అల్లనఁ గలిపియుకాచిన సల్లలితపు కీరుగల్గు జయగృహలక్ష్మీ!

ఈ కీరు నెలదినంబులు ప్రాకటముగఁ ద్రాగుచున్న బాలెంతలకున్
జేకూరును స్తనదుగ్ధం బేకొఱతయులేదు తెలియుమీ గృహలక్ష్మీ!

'కోలోస్ట్రిం' నాబరగెడు మేలిరకపు ద్రవమొకొండు మిసమిసలాడున్
వాలాక్షుల గుబ్బలలోఁ బాలుం బూరించు ప్రకృతి వరగృహలక్ష్మీ!

విటమినులు మాంసకృత్తులు పటుతరముగఁ గల్గియున్న ప్రకృతి సహజమౌ
దిటవైన తల్లిపాలకు నెటు పశువులపాలు సాటి హితగృహలక్ష్మీ!

పశువుల పాలఱుగదుబో శిశువులకును తల్లిపాలె సేమం బొసగున్ ;
విశదముగ దీనిఁదెలియుము శశిముఖి మఱవంగవలదు జయగృహలక్ష్మీ!

చనుబాలను 'బాక్టీరియ' యనబడు క్రిములేమి లేవటంచును యూరో
ప్యనిపుణులు వచించిరి చల్లని తల్లివి దీనిగనవలయు గృహలక్ష్మీ!

సులభముగ భేదికల్గును సులభముగా జీర్ణమగును శుభకరమగుచున్
వలసిన యుష్ణము పిల్లల కలవడు జనుబాలుఁ గ్రోలగా గృహలక్ష్మీ!

ఇక్కాలంబునఁ గొందఱు మక్కువ తో స్తన్య మొసఁగమానిరి బిడ్డల్
కక్కుర్తిని 'టిన్పాలతో' చక్కగ వర్ధిల్లఁగలరె జయగృహలక్ష్మీ!

గుబ్బలక్షీరము పాపం డుబ్బుచుఁ గడుపారఁ ద్రాగుచున్న సతంబున్
గుబ్బల సౌందర్యంబులు తబ్బిబ్బగునంచు మదినిఁ దలఁపకు లక్ష్మీ!

చనుగుబ్బ లుబ్బిక్షీరము దనయంతటఁ గురియుచుండు దైవనియోగం
బు నెఱుఁగవశమా పిల్లలగనుతల్లివి ప్రేమనిధివిగా గృహలక్ష్మీ!

చనుబాలుండియు దాదులకును పిల్లలనొసఁగుటదియ కూడనిపని చ
ల్లనితల్లివి నీపాపల మనుపుము నీవే ప్రియాన మాగృహలక్ష్మీ!

వక్షోజంబులు పాపల కుక్షులఁ బోషించు పాలకుండలు నీవీ
శిక్షణ సూత్రమెఱింగియు రక్షింపుము వారిమమత ప్రాగృహలక్ష్మీ!

గుటగుట పాలుం గ్రోలెడు చిటిపాప హొరంగుఁగాంచి, చెక్కిలిముద్దుల్
తటపట గొను యాచెలువము కుటిలాలక నీకెతగును గుణగృహలక్ష్మీ!






## చెన్నపురి చంద్రకలా

గోధుమపిండి స్వంతముగ తయారు చేసినదైయైన మిక్కిలి శ్రేష్ఠమైనది. అంగడులలో దొరకునది యంత శ్రేష్ఠమైనది గాజాలదు. అంతరుచికరముగను నుండజాలదు. కావున మంచిగోధుమలు తెచ్చి పిండిచేసి పూరీకి మల్లె అప్పడములుగా తయారుచేసి పంచదార, తియ్యదోసవిత్తులు, ద్రాక్షపండ్లు, చారపప్పు, జీడిపప్పు వీని నన్నిటిని నూరి కొంచముతీసి అప్పడములుగ తయారుచేసికొనిన దానిలో పెట్టి పైన దానితో మూతమూసి నేతిలోకాల్చి ఉపయోగింపవలెను.

## అల్లపు హల్వా

రెండుశేర్లు అల్లమును తెచ్చి పైపొట్టునుదీసి శుభ్రపరచి వేడినీళ్ళలో ఉడకబెట్టి సన్నికలులో వేసి మెత్తగా నూరవలయును. నూరిన తరువాత ముప్పది తులముల నేతిలో అల్లము వేయించవలెను. పదితులముల నేతిలో ఆరుతులముల గోధుమపిండిని వేయించి అల్లములో కలుపవలయును. తరువాత ఒకశేరు చక్కెరను పాకముపట్టి సిద్ధముగానున్న అల్లపుముక్కలను పది గురిగింజల యెత్తు కుంకుమపువ్వు చూర్ణమును వేసి బాగుగా కలియబెట్టి దించుకొనవలయును. దించినపిమ్మట పదితులముల బాదముపప్పువేసి కలియబెట్టవలయును. గడ్డకట్టియున్న హల్వాను ముక్కలుగాకోసి భుజించిన యెడల చాలా రుచికరముగానుండును.

## దానిమ్మపండ్ల రసఫలహారము

ఒకశేరు పుల్లదానిమ్మ పండ్లయొక్క రసమునుతీసి దానిలో గోధుమ పిండి నాలుగు తులములు కలుపవలయును. తరువాత నానబెట్టి పొట్టుతీసినటువంటి పదితులముల బాదమపప్పు, పదితులముల గసగసాలు, పదితులముల యాలక్కాయలు, పదిజాజికాయలు, గింజలుతీసిన యిరువది తులముల ద్రాక్షపండ్లు వీటినన్నిటిని మెత్తగానూరి ఆముద్దను అర్ధశేరు ఆవుపాలలో కలుపవలయును. కలిపిన తరువాత వడియకట్టి గోధుమపిండి కలిసిన దానిమ్మపండ్ల రసములో పోయవలయును. ఆరెండింటిని బాగుగా కలిపిన పిమ్మట దానిలో పదితులములు చక్కెరను పాకముపట్టిపోయవలయును. పాకముపోసి బాగుగాకలియబెట్టి స్పూన్‌తో (చిన్నగరిటెతో) భుజింపవలయును. ప్రతిదినము ఉదయము భుజించుట వలన సమశీతోష్ణస్థితిని కలుగచేసి యుత్సాహవంతులను చేయును.

## బెసన్ లడ్డు

ప్రశస్తముగ ఒకశేరు శనగపిండిలో ఒకశేరు నెయ్యివేసి కలిపి, ఒకబాణలిలో వేసి సువాసన వచ్చునట్లు వేయించవలెను. తరువాత దానిని దించి మరియొకపాత్రలో పోసి ఆరబెట్టవలయును. ఆరబెట్టిన శనగపిండిలో ఒకశేరు పంచదారను కలిపి కొద్దిగా మర్దనచేసి దానిలో మూడుతులముల కలకండపొడి, ముప్పావు తులము యాలకులపొడి, ముప్పావు తులము పిస్తాపప్పు, రెండుతులముల కిస్‌మిస్ పండ్లువేసి కలిపి ఉండలు కట్టుకొనవలయును. ఇది శరీరమునకు బలమును కాంతియు నిచ్చును.

## కొబ్బరిముక్కల కందిపిండిలడ్డు

పన్నెండు తులముల నేతితో పన్నెండు తులముల కొబ్బరిముక్కలను వేయించవలెను, మరల పన్నెండు తులముల నేతితో పన్నెండు తులముల పెసరపప్పుగాని, కందిపప్పుగాని, వేయించి యుంచవలెను. తరువాత ఒకకళాయి పాత్రలో యిరువది నాలుగు తులముల చక్కెరపోసి, కొద్దిగా నీళ్లుంచి పొయ్యిమీదపెట్టి, ముదురు పాకముకు వచ్చిన తరువాత వేయించియున్న కొబ్బరి ముక్కలు, కందిపప్పును వేసి ఉండలుగా చేసుకొన వచ్చును, (ఇష్టమైనవారు కందిపప్పును పొడుము చేసుకొనవచ్చును, కొబ్బరి తురుముకొనవచ్చును) యిదితినుటకు చాలా రుచికరముగా యుండును.

## కొబ్బరికాయ పచ్చడిగారెలు

రెండు కొబ్బరి కాయలను తెచ్చి పగులగొట్టి సన్నని ముక్కలుగా తరిగి యుంచవలయును. నానబెట్టిన పదితులముల పెసరపప్పు, పదితులముల శనగపప్పును, సిద్ధముగా నున్నకొబ్బరిముక్కలును రుబ్బి అందులో నాలుగు నిమ్మపండ్ల రసముగాని రెండు తులముల చింతపండు పులుసుగాని కలిపి యొకచో ఉంచుకొన వలయును, (దబ్బపండ్లరసము కూడా చింతపండుకు బదులుగా కలుపుకొనవచ్చును.) తరువాత ఒక ఇనుపబాణలి పొయ్యిమీదపెట్టి మూడుతులముల నెయ్యివేసి క్రాగినంతనే, పదితులముల మిరపకాయలు వేయవలయును. మిరపకాయలు సగము వేగిన తరువాత ఆరుతులముల అల్లపు ముక్కలను వేయవలెను. ఆరెండు వస్తువులు మూడుపాళ్లు వేగిన తరువాత అరతులము జీలకర్ర, అరతులము ధనియాలును వేసి తిరుగబోత పరిచేసుకొని కొబ్బరి ముక్కలున్న దానిలో కలుపవలెను. నానబెట్టి సిద్ధముగా నుంచుకొనిన అర్ధశేరు శనగపప్పును కొబ్బరికాయల నీళ్ళతో రుబ్బి తిరుగబోత వేసిన కొబ్బరిముక్కలలో వేసి కలుపవలయును. ఒక బాణలిలో నెయ్యిపోసి కాగిన తరువాత ఆపిండిని బిళ్ళలుగాచేసి దానిలో వేయించుకొనవలెను. కావలసినవారు ఆసమయముననే ఒకశేరు పెరుగులో రెండుతులముల ఉప్పు, రెండు గురింజల యెత్తు పసుపువేసి ఒకచో నుంచవలెను. తరువాత బాణలిలో రెండుతులముల నెయ్యివేసి మూడుతులముల మిరపకాయలు వేయించవలెను, మిరపకాయలు మూడుపాళ్లు వేగిన తరువాత అరతులము ఆవాలు మెంతులు కలిపి వేయవలెను, తిరగబోత పరిచూచుకొని పదికరివేపాకు రెబ్బలను వేసి, ఆపెరుగులో కలపవలెను, పెరుగులో తిరుగబోత పెట్టిన తరువాత నేతిలోగాని నూనెలోగాని, వేగిన కొబ్బరిగారెలు, అందులో ముంచవలయును. ఇష్టమైనవారు నాలుగు తులముల పంచదారను కూడ పెరుగులో కలుపుకొందురు. ఈమసాల పెరుగు అన్నములో కలుపుకొనిన బహురుచికరముగా నుండును.

వాశిరెడ్డి సుశీలాదేవి

## పొంగలి

1 అశాకుబియ్యం, ½ అశాకు వేయించిన పెసరపప్పు పాలతో మెత్తగా వుడకపెట్టవలెను. 1 కొబ్బరి కాయ కోరి నేతితోవేయించి, 3 అశాకుల పంచదార, 1 చంచా ఏలకపొడి 3 పలముల జీడిపప్పు, 1 అశాకునెయ్యి అన్నిపోసి మొత్తం 15 నిమిషములు పొయ్యిమీదవుంచి కలియపెట్టి దింపవలెను.

## పులిహోర

1 తవ్వబియ్యం అన్నం వార్చవలెను. ఒక పళ్లెంలోకి కరివేపాకు, 1 చంచాపసుపు, 1 అశాకు నూని, వార్చిన అన్నంవేసి కలపవలెను. 4 తులముల నూని పొయ్యిమీద కంచుగిన్నెలోపెట్టి, 2 తు॥ మినప్పప్పు, 1 తులం శనగపప్పు, 1 తులం ఆవాలు, చిటికెడు మెంతులు, 1 పలం జీడిపప్పు, ఇంతపుగింజంత ఇంగువ,

కర్వేపాకు, 6 తు॥ మిరపముక్కలు ఎఱ్ఱగావేపి 1 పంపు చింతపండు, పులుసు చిక్కగా తీసి పోపులో పోయవలెను. 10 నిమిషాలు వుడికించి 4 తు॥ వుప్పువేపి, అన్నంలోపోసి కలపవలెను, పైన 2 గరిటెలు నూనివేసి బాగా కలియపెట్టవలెను.

## కజ్జికాయలు

1 తవ్వ పెసలు ఎఱ్ఱగా వేయించి పప్పువిసిరి, మెత్తగా పిండిగా విసరవలెను. 2 కొబ్బరికాయలు కోరి, నేతితో వేయించివుంచవలెను. 1 వీశ బెల్లం తరిగి, పైన తయారుచేసిన కోరు పిండి, బెల్లంకలిపి 1 తులం ఏలకులు, 5 పలముల జీడిపప్పు మొత్తం అన్నికలిపి 4 తులముల నెయ్యివేసి పళ్లెంలో పెట్టవలెను. 1 శేరు మెత్తని గోధుమపిండి కొంచం నెయ్యి, 1 చిటుక కొట్టినవుప్పు, నీరుపోసి గట్టిగా కలిపి 4 గంటలు నాననిచ్చి, చిన్నవుండలుచేసి పూరీలు వత్తవలెను. పూరీలో 1 చంచా పొడిచొప్పునవేసి కజ్జికాయల బల్లలో పెట్టి మడిచి తీసి నేతితో వేయించి తీయవలెను.

## మైసూరుపాక్

1 ఆళాకు శనగపిండి, 2 అళాకుల పంచదార, 2 అళాకుల నెయ్యి, కొల్చివుంచవలెను. పంచదార లేతపాకం రానిచ్చి శనగపిండి చల్లుతూ కలపవలెను. 15 నిమిషములకు కొంచం నెయ్యిపోసి కలుపుతూ వుండవలెను. కొంతసేపటికి నెయ్యిఅంతాపోస్తూ కలపగా పైకిపొంగువస్తుంది. అప్పుడు ఒకపళ్లెమునకునెయ్యి రాచి దానిలోపోసి పైన కొంచం నెయ్యివేసి ముక్కలుకోయవలెను. ఈప్రకారంచేస్తే చాలబాగుంటుంది.

చావలి అన్నపూర్ణాబాయి.

---

## కండ్లజోడు తగవు

గుండి రాజులు.



కండ్లకోసముపుట్టెంని కండ్లజోడు;<br>
ముక్కుపైనుండు గావున ముక్కుజోడు;<br>
అనుచు తగువులు బడుచుండె అవనిలోన<br>
ముక్కు, కన్నుల తగవును ముందుగాను<br>
తీర్చి దిద్దుడి వేగమే స్థిరముగాను<br>
తప్పులెల్ల క్షమించి తలి తండ్రులారా!

*




ఆకుజెముడు :- ఇంతవరకు పసిపిల్లలకు సామాన్యముగా ఔషధములవలె ఉపకరించు తమలపాకులు, తులసిఆకులు, సదాపాకు, శొంఠి, మిరియము, కరక్కాయ, వాము, ఆవాలు, మోదుగమాకలు, వేపాకు, మారేడు మొదలగు మరెన్నో తెల్పియుంటిమి.

ఆకుజెముడు పల్లెలలో గృహావరణములయందు కానుపించును. దీని ఆకు పెళుసుగ నుండును. విరిచినపాలు స్రవించును. పాలుత్రాగు చంటిబిడ్డలకు అజీర్ణవాతమువల్ల పొట్ట బిగియుట, ఉబ్బుటవల్ల మలబంధము కలుగును. తదుపరి దోషయుక్తమయిన కఫము గొంతుకచేరును. పిల్లలు తారుమారు అగుదురు. అట్టి పట్ల వకఆకును నిప్పులసెగ నుంచవలయును. వాడినట్లు తెలుసుకొని రసము తీయవలయును. తీసినరసమును పాలలోగాని, ఆ ముదములో గాని రెండు చుక్కలను మాత్రమే వేసి ఉగ్గుపాలవలె పోసిన పైనపేర్కొన్న లక్షణములన్నియును శమించును. దగ్గుచేకల్లు ఎగరొవ్వు, శీతలబాధ నివారణగునని డాక్టర్ కోమర్ గారు తెల్పియున్నారు.

పల్లె గ్రామములందు సమయానుకూలముగ పట్టణనివాసులకు వైద్యసహాయము దొరికినట్లు చేకూరదు. అట్టిజబ్బులకు ఎనిమా తప్పక చేయుటకూడ అవసరమని తోచును. పల్లెలనుండు వారికి యీ దివ్యమూలిక ఎంతయో సహాయపడును.

కాడజముడు అని మరియొకటికలదు. దీని నుపయోగించుటకూడ యిదేవిధము.

సన్నరాష్ట్రం :- ఇది పచారు అంగళ్ళలో లభించును. చాలమంది వైద్యులు దీనిని తప్పక వాడుదురు. ఉదరసంబంధమయిన వ్యాధులయందు సుపయుక్తమయినది. ఉత్తేజమునొసంగి నరములకు శక్తినిచ్చును. కఫమును తగ్గించును. శ్వాసకోశ సంబంధమయిన జబ్బులకు సన్నరాష్ట్రం చూర్ణముతోకూడ, అతిమధురము, పిప్పళ్ళు చూర్ణమును కూడ తేనెతో చేర్చి వాడటంకూడ కలదు. ఈ మూలికయొక్క కషాయమును అనేకులకు యిచ్చినందున శీతలబాధ తొలంగి సుగుణమిచ్చినదని డాక్టర్ కోమర్ గారు తెల్పియున్నారు.

కషాయము :- 2½ తులం సన్నరాష్టమును చితుకగొట్టి సుమారు 5 ఔన్సులనీళ్లలో వేసి 2 ఔన్సులగునట్లు దిగకాచి వడియగట్టి పూటకు ½ ఔన్సుచొప్పున రోజుకు రెండు పర్యాయము లివ్వవచ్చును.

చూర్ణమున :- { సన్నరాష్ట్రము 1 తు.<br>అతిమధురము 1 తు.<br>పిప్పళ్ళు 1 తు.

సన్నరాష్టమును, పిప్పళ్ళను కొంచెము వెచ్చచేసి చూర్ణము చేయుటమంచిది.

పూటకు 3 గురిగింజల ప్రమాణము చొప్పున తేనెతో రోజుకు రెండుపర్యాయములు వాడవలయును.

# ఇంటిపనులలో మెళకువలు

## బిడ్డయెడల తల్లి చేయవలసిన విధులు

**కడుపుపొంగు:**—వస అరగదీసి బొడ్డుచుట్టూ వేతురు. ఇంకను పొంగు తీయనిచో ఆముదము రాచి కాపవలయును. లేనిచో పండు తమలపాకుకు ఆముదమురాచి వెచ్చజేసి కడుపుమీద వేయవలయును. ఇది జ్వరము తగిలినప్పుడు వచ్చినడాక్టరుకు జూపవలయును.

తల్లిపాల బిడ్డకు ఈ కడుపుపొంగురాదు. బిడ్డ ఎక్కువగాఏడ్చిన కడుపుపొంగును. అది అలవాటుగా తరచుగా గేస్ నిండుతూఉంటుంది. ఇది పోతపాలబిడ్డలకు తరచుగా వచ్చేజబ్బు. జాగ్రత్త తీసుకోనియెడల ప్రమాదమునకు దారి.

**ఇంకా నాలుక తెల్లగా ఉంటుంది ఇది చెల్ది:**—నాలుకమీద తెల్లగాఉంటుంది. ఇది నూనెగుడ్డతో తుడిచిన పోతుంది. లేక మాచికాయ అరగదీసి తెల్లనిబట్టకురాసి తుడిచిన పోతుంది. చప్పి కూడా ఈ జాతిలోనిదే. ఇది నోటిలో నోరుపెట్టి ముద్దులిచ్చినందునను, కడుపు శుభ్రములేనందునను బిడ్డలకు వచ్చేవ్యాధి. ఇది మొదటలో జాగ్రత్త తీసుకోనిచో కడుపులోనికిపోయి ప్రాణాపాయం తెస్తుంది. ముదరకముందు డాక్టరుకు చూపవలెను.

**గజ్జి:**—ఇది అశుభ్రమువల్లనేగాక శరీరములోనున్న రక్తపు అపరిశుభ్రమువల్లనుకూడా వస్తుంది. దీనికి మందు ఏశరీరానికి ఏది పడుతుందో అది వేసుకోవాలి. చాలామందులు అందరికి తెలిసినవే.

కొన్ని గజ్జిలు తలిదండ్రుల సుఖవ్యాధులవల్ల కలుగుతాయి. అట్టిబిడ్డలకు పైపైపూతలే గాకలోపలికి కూడా మందు వాడవలయును. ఈ రకపు వ్యాధులకు డాక్టర్లు ఇంజెక్షన్సుకూడా వాడుతున్నారు.

**బిడ్డలు సకాలములో నడువలేకపోవుట:**—తల్లిపాలతో ఆరోగ్యంగా పెరుగుతున్న బిడ్డ పదకొండవ మాసమురాగానే తప్పటడుగులు వేస్తుంది. జబ్బులు తరుచుగా పడు బిడ్డసంగతి చెప్పనక్కరలేదు. పోతపాలబిడ్డలును కొంతమంది పదకొండవ నెలలోనే నడక ప్రారంభింతురు.

బిడ్డలు నడవలేకపోవుటకు గలకారణము కాళ్ళలో కాల్షియంలేకను, మూలుగు సరిగాలేకను పోతపాలు పోసేవారు పాలలో పంచదార కలపడానికి అశ్రద్ధచేస్తారు. అందువల్ల కాళ్లు సత్తువసన్నగిల్లును. తల్లిపాలలో సృష్టియే అన్నియు కలుపును. కనుక ఫరవాలేదు.

**పొంగు విరోచనములు:**—ఆవుపెరుగుమీద తేరు నీరు వడియగట్టి పంచదారకలిపి గుల్లెడు పట్టిన తగ్గును. బార్లీ ఎక్కువగా వాడవలయును. ఆరునెలల బిడ్డదగ్గరనుండి వైవిధముగా వాడవచ్చును. ఏమియు జబ్బుచేయదు. కాని పగలే వాడవలయును. రాత్రులు వాడరాదు. శృతిమించిన డాక్టరుకు చూపవలయును.

**పసరు విరోచనములు:**—దంపపసుపుకొమ్ము వేడినీటితో అరగదీసి కొద్దిగా ఆముదములో కలిపిపట్టిన తగ్గును. ఆకుకూరలు తల్లితినరాదు.

పళ్లు వచ్చేటప్పుడుకూడా విరోచనములగును. అశ్రద్ధజేసిన రక్తవిరోచనములుగా మారి ప్రాణహాని యగును. గ్రైప్‌వాటర్ వాడిన కొంతమందికి గుణమిచ్చును. లేదా డాక్టరుకు చూపించవలయును.

సోదరీమణులారా! బిడ్డను కనగానే సంతోషముకాదు. ఆబిడ్డను ఎట్లు పెంచవలయునో నేర్చుకొనవలయును. ఎంత ధనికుడైనను తనభార్య అజాగ్రత్తవల్ల బిడ్డకువచ్చే రోగములకొరకు డాక్టరును తరుచుగా దెచ్చుటకు విసుగుకొంటాడు.

పి. జె. శాంతమ్మ.

# బ్రతుకు తెరువు

## హైందవస్త్రీ కుంకుమ మానరాదు

భారత దేశములో పుట్టి భారత నారీమణులమై హైందవధర్మం పోగొట్టుకొనుట ధర్మంకాదు. కాబట్టి హిందూ స్త్రీలందరు నొసట కుంకుమ పెట్టవలెను. కొంతమంది సోదరీమణులు పాశ్చాత్య నాగరికతవలన కుంకుమ మానివేసినారు. ఇటువంటి వారిని అనేక మందిని చూచినాను. చూచినది కొంచము వ్రాసెదను.

**ఉదాహరణ :-** శ్రావణ శుక్రవారమునాడు మా ప్రక్క ఇంటి పేరంటమునకు వెళ్ళినాను. ప్రతిచోట జరిగేవిధముగనే పసుపు కుంకుమ ఇచ్చినారు. (పసుపు పూసుకొనుట చాలరోజులనుంచి మానివేసినారు. ఇప్పుడు కుంకుమకూడ మానుచున్నారు.) పేరంటమునకు వచ్చినవారిలో ఒక ఆవిడ బొట్టు అసలు పెట్టించుకొనలేదు. చేతిలోనికి తీసుకొని ప్రక్కనదులిపి పోసినది. ఈ విధముగ జరుగుచున్నది. ప్రతిఒక్కరు కుంకుమ చేయుట నేర్చుకొని నొసట కుంకుమ పెట్టుకొన్న ముఖము కళగావుండును.

### కుంకుమ చేయువిధానము

ఒకసవాశేరు పసుపుకొమ్ములు చితకకొట్టవలెను. పటిక నాలుగుతులములు, వెలిగారం మూడుతులములు మెత్తగా నూరవలయును. (రెండుకలిపి నూరినచో పాకము అగును. దేనికది నూరవలయును.) ఆ నూరినది పిండిజల్లెడతో జల్లిడపట్టవలయును. నిమ్మకాయలరసం పావుశేరు తీయవలయును. తీసినరసములో నూరిన వెలిగారంపటిక కలపవలయును. ఇవి కలిపినతరువాత రసము ఎఱ్ఱపడును. ఆ రసములో చితుకకొట్టిన పసుపుకొమ్ములు వేయవలెను. ఆ పసుపుకొమ్ములు రసములో మూడుదినములు నానినతరువాత అవి నీడలో ఆరబెట్టవలయును. (ఎండలో ఆరబెట్టిన తెల్లపడును) పగలెల్ల ఆరబెట్టి సాయంత్రము రసములో పోయవలెను. ఈ విధముగా రసముఅంత అయిపోయినదాక చేయవలెను రసముఅంత అయిపోయిన తరువాత కొట్టేవిధముగా ఆరబెట్టవలెను. ఆరిన తరువాత అవి రోటిలోవేసి దంచవలెను. ఆ దంచిన కుంకుమ పలచని వస్త్రములో పోసి వస్త్రకాళితం పట్టవలెను. ఆ పట్టినకుంకుమలో, 2 స్పూనుల నూనివేసి కలపవలయును. ఇది నొసటపెట్టుకొనుటకు ఎంతో అందముగా నుండును.

నాళం అలివేలుమంగతాయారమ్మ

# జోలపాటలు

చె. శ్రీ. వెంకటరామయ్య

హాయీ, హాయీ ఆపదలు కాయీ
చిన్నవాండ్లను కాయి శ్రీరంగశాయి
శ్రీరామ, జయరామ, శృంగార రామ
చారువిక్రమ, రామచంద్ర, రఘురామ
వెంకటప్పడవయ్యా, వెన్నుడవయ్యా
మాచిన్నవాండ్లెల్ల మీదాసులయ్యా
పాలకావిళ్ళు మాకెదురాయెనమ్మ
బాల కృష్ణుడు మాకు తోడాయెనమ్మ
నీళ్ళకావిళ్ళు మాకెదురాయెనమ్మ
నీలవర్ణుడు మాకు యెదురాయెనమ్మ
చిచ్చి, చిచ్చీ, చిచ్చి శ్రీలక్ష్మిరావె
ఆదిలక్ష్మిరావె, అమ్మతోనాడ.
చిచ్చి, చిచ్చీ చిచ్చి, చీమల్లమఱ్ఱి
మఱ్ఱిక్రింద అమ్మాయి మాటల్లవెఱ్ఱి.
చిన్నారివే నీవు చిలకవే నీవు
చిత్రాన రాసేటి బొమ్మవే నీవు
చిన్ని మాపాపమ్మ చీమంతకద్ద
కూసేటి కూతలూ కొండలదిరేను.
చిచ్చోసి కుక్కలకు సిగ్గేలలేదె
చిన్న మాపాపకు నిద్రేలరాదె.
నిద్రకూ వెయ్యేండ్లు, నీకు వెయ్యేండ్లు
నినుగన్న తండ్రికి నిండు వెయ్యేండ్లు.
నిద్ర వచ్చిందమ్మ నీలి కన్నులకూ
నీలి జంగం మాకుతోడు వచ్చింది.
చిచ్చమ్మ చిచ్చమ్మ చిన్నపాపలకు
లాలమ్మ, లాలమ్మ రామచిలకలకు
అందారి మామల్లు చందమామల్లు
అమ్మాయి మామల్లు రామలక్ష్మణులు
వరిమళ్ళు కలుగంగ, వనములుండంగ
పట్టిమిట్టలపోయి వర్షమ్ము కురిసె
వానా! కురియవే వరిమళ్ళలోను
చిలకా! నీవుపోయి చిత్రించిరావె
హంసల్లు చెలరేగి అరటిచెట్టెక్క
చిలకల్లు చెలరేగి జీడికొమ్మెక్క
పాపాయి చెలరేగి మామభుజమెక్క
మామభుజమెక్కితే మరియేమి అడుగు?
పాల్తాగ గిన్నెడగు, పాడియావడుగు
ఒక్కావు తోలితే ఒప్పకాదంచు
మందటావులు తోలుదురు మామయ్యలంత
ఆయావు, యీయావు దొడ్డిలోతోలి
పిండరా ఓయన్న బిందెలనిండ
కాచవే ఓయమ్మ కడవలనిండ
తాగునే పాపమ్మ తాగడుపునిండ
పాపమ్మ నెవ్వరే కొట్టినవారు
కొట్టిగోవులపాలు కొనిపోసినారు
ఏడవకు. యేడవకు యెర్రన్నిపాప
ఏడిస్తె నీకంట నీలాలుకారు
నీలాలు కారితే నే జూడలేను
పాలైనకారవే పసిపాపకంట!
చిన్నారి పొన్నారి గాజులశెట్టి
తేనె గాజులశెట్టి టెంకాయశెట్టి
కంచికి పోయేటి గాజులాశెట్టీ
కంచికామాక్షమ్మ యెవరాడపడుచు
శివకంచి యేలేటి శివునికీ "భార్యా"
విష్ణుకంచి యేలేటి విష్ణుచెల్లెలు.
బూచివాడారార, బుట్టల్లుకోని
బుట్టలో పాపనూ మాకిచ్చిపోర
బూచివానికి యెవరు బువ్వపెట్టేరు
పాపమ్మ పెట్టునే పాలమీగడలు
హాయివారింటికే పోయీ వత్తామా?
అరటిపండ్లాగోలా కోసుకొస్తామా?
దానిమ్మ పండ్లెఱుపు, ద్రాక్ష పండ్లెరుపు
తానెరుపు అమ్మాయి తనవారిలోన.
చిన్నమాపాపమ్మ చెన్నగిరిపువ్వో
వాడన్ని పుష్పమే తాను అమ్మాయి
వాడని పూవుకూ సీడనీ తొడిమ
రంభంటి అమ్మాయికి రాజంటి మొగుడు!

# భారత మహిళ

శ్రీమతి అయ్యగారి రాఘవమ్మగారు

వేదపురాణశాస్త్రములు వేరైపోయిన భారతీయ, సం
పాదన దేవతార్చనయు భక్తియు నీతియు నార్యధర్మముల్
ఏదరిఁ జేరనీయకిటు లింపుగఁ గాచిన తల్లివీవు ని
న్నాదర భావముం గనుట, అబ్బురమా! లలనా శిరోమణీ!

పురుషుండేకడ, పుణ్యపూరుషుఁడు పూజ్యుండన్న కాలంబునన్
స్థిరమౌ జీవన మార్గసాహితికి జేజేలిచ్చు కాలంబునన్
తిరుగా గుమ్మము ద్రొక్కఁగేస్తునకు జ్ఞప్తిం దెచ్చి యాచారముల్
మరుఁగైపోకను నిల్పినట్టి మణి వమ్మా! భారతాంబాసతీ!

స్వేచ్ఛా భారతమందు నేఁడు మరలన్ జేకొందుమా ఆర్షముల్
యిచ్ఛాశక్తినటన్న వీరలకు నేఁడీపాటి యీ ధర్మముల్
విచ్ఛిన్నంబై పోక నిల్పినది నీవేగా మహాదేవి నీ
యిచ్ఛాశక్తికి క్షేమసంగ వలెనో యీరేడు లోకంబులన్!

"అరయ మహాపతివ్రతలు ఆర్షసతుల్" అను నాను డెల్లెడన్
విరసము నొందనీయకిట ప్రీతిని గాచుచు పూజ్యతా సతీ
పురుషులనెల్ల నట్టులె పురాణము లందునె గాక నేఁడు నీ
భరతసతీత్వ నామమును భవ్యగతిన్ నిలబెట్టి తమ్మరో!

సంపన్నుండయినన్ దరిద్రుఁడైనన్ సారూపుఁడైనన్ దగన్
ఇంపున్ గూర్చుచునున్న నిష్ఠురములన్నోర్పించుచున్ మానసో
త్కంపంబున్ గలిఁగించుచున్నను పతిన్ దైవంబుగా నెంచు నీ
యింపున్ జూచిన మెచ్చరే! యెవరు యేకాలంబునన్ ఎచ్చటన్!

అట్టిసతీత్వనామమున ఖ్యాతిని జెందిన ఆర్షభూమి, నేఁ
డిట్టుల శాసనాల్ వలసివచ్చె విడాకులటంచు నేమొ! హా!
పుట్టిననాఁటినుం డెరుగ రీవిధి; పూజ్యులు నీదుబిడ్డలీ
పట్టున వారి నీవిధికిఁ బాల్పడకుండగఁ బెంచుమమ్మరో!

కష్టతరమైన పెండ్లిండ్లు నిష్ఠురములు
వలదుతల్లి యికన్నేడు వలదుగాని
స్వేచ్ఛగా మన పెండ్లిండ్లు సేయుచుంట
ఆర్షధర్మము అనియె నేఁడనుమతింపు!

# తులాభారం



శ్రీమతి ఈమని వెంకటలక్ష్మిగారు

### ప్రవేశము :

(చిన్న మొగములో సత్యభామయు, నారదుడు.)

నా:- అదియా! జరిగిన సంగతి? ఆ దేవకీ నందనుడు సత్యాప్రియు డనుకొనుచుంటినే కాని ఇట్టిపక్షపాతి యని యెన్నడనుకొనలేదే?

స:- ఈ పారిజాతము వలన యిప్పుడు మీకు బోధపడినదికదా? ఆయన కపట వర్తనము? పైకి మాత్ర మిట్లు ప్రేమ జూపుచున్నట్లే నటించును.

నా:- ఇటు నటు జూచి (రహస్యముగ) తల్లీ! నీవిభుడు నిన్నెల్లప్పుడును ప్రేమించుచుండుట కొక వ్రతము జెప్పెద వినెదవా?

స:- అదియేదో సత్వర మెఱింగింపుడు.

నా:- దగ్గరగా జరిగి, మెమ్మదిగా) పుణ్యక వ్రతమని యొక వ్రతముగలదు. ఆవ్రతము జేసిన వనితల కెల్లపుడు విభుడు వశుడైయుండును.

స:- దాని విధంబేది?

నా:- ఒక శుభముహూర్తమున దన విభుని సర్వాలంకారుని జేసి దక్షిణ పూర్వకముగా యొక సద్బ్రాహ్మణునకు దాన మియ్యవలెను. తిరిగి యాతని యెత్తుధన మాభూసురునకిచ్చి విభుని కొనవలయును.

స:- ఇసీ! ఇంతయేగదా? యింకనేమో యనుకొంటిని. శమంతకమణి దినమునకు పన్నెండు బారువుల బంగారము గురియుచునే యున్నదిగదా? అదిగాక యింక నెంతయో మూలధనమున్నది. ధనమునకు కరవులేదు. గాన నో దేవమునీ! యాదానమునకు నీకన్న దగినవారెవ్వరు? దయయుంచి యొక క్షణ మాగితివా, యాగానలోలుని నీకే దానమిత్తును.

నా:- (ఆయిష్టము నటింపుచు) సరే, నీవు కోరి కాద నెట్లందును? తడవు సేయక సర్వము సిద్ధము జేసికొని రమ్మ.

(తెర)

### 2 వ రంగము

(తెరయెత్తగా తక్కెడ యందున్న శ్రీకృష్ణుడును ప్రక్క సత్యభామ, నారదుడు నుందురు.)

నా:- దేవీ! నాకాలస్య మగుచున్నది. మాధవా! పోదము రమ్మ!

స:- (ఆర్తోక్తిలో) మునివర్యా! నేనేమి సేయుదును? ఇంటనున్న ధనమంతయు వేసితినిగదా? నాథునితో దూగకుండుట జూడ నీమహిమయో, నాథుని మాయయో, గాని నాయింట నున్నధనమే చాలకుండె నన నింకేమి గావలయును? ముని వర్యా! నాకేదైన దారి జూపవా?

నా:- దేవీ! నీకన్న నాకేమి దెలియును? అతులిత భాగ్యములతో దులదూగు నీకంటె నైశ్వర్యవంతు లెవరు తల్లీ! ఇల్లు వాకిలిలేని దేశద్రిమ్మరినగు నావద్ద నీ తులసి పూసల మాలయు నీ తంబుర దొక్కు కన్న నింకే మున్నదని జెప్పుచుంటివు!

(ప్రవేశము. జాంబవతి, భద్ర, కాళింది మొదలైనవారు)

భ:- అమ్మా! ఈ ఘోర వ్రతము నీకేదోచినదా? లేక, ఎవరైనా బోధించిరా?

జాం:- ఏమీ! గోవిందుని దానమిచ్చుటకు నీకేమి యధికారమున్నది? గోపాలుడు నీ ఒకదాని పతియో మాకును గాదె? కాదా?

కా:- (చెక్కిళులు నొక్కుకొనుచు) చాలు చాలు. పతిని వశపరచుకొనుటకు వ్రతములును, ప్రయోగములును కూడ నున్నవా? యేమి విపరీతమమ్మా!

నా:- దేవకీనందనా! నాకాలస్యమగుచున్నది. పోదము రమ్మ.

"హరిముకుంద శ్రీకృష్ణా! శ్రీహరి"

(పోవుదురు)

స:-(అడ్డుపడి, నారదుని పాదములపైబడి) నారద మునీంద్రా! నీకిది న్యాయమా! వ్రతమెరిగించిన వాడ విదిగూడ జెప్పి పుణ్యము గట్టికొమ్ము.

నా:-(ఆలోచించి) అటులైనచో నేనొకటి జెప్పెద. అది...నీ...కంగీకారమగునో, లేదోయని సందియముగా నున్నది.

స:-మునిపుంగవా! మీరేది చెప్పినను నాకిష్టమే. సంశయింపక త్వరగ సెలవిండు.

నా:-అటులైనచో సత్వర మా రుక్మిణీదేవి కడకేగి యడిగినచో దగునుపాయ మామెయే జెప్పును.

స:-(కొంచెము సందియముతో కొంతతడవాగి) దేవా! నాకడలేని ధనమామెకు మాత్ర మెటులవచ్చును? ఇంతకన్న నామెమాత్రమేమి సేయగలదు?

నా:-తల్లీ! ఆదేవదేవుని దూగించుటకుగల ధనమామె కడనే యున్నది. ఆయింతికి పతియే దైవము భక్తియే ధనము. ఆదానవాంతకుని వశపరచుకొనగల శక్తి ఆయింతికిదక్క నన్యులకు దరము కాదు. పతిని బడయగోరుచో నదియే దగుసాధనము.

స:-(దీనవదనయై కృష్ణునిజూచి) సత్యాప్రియా! యింతకన్న వేరేదేనుపాయము లేదా!

కృ:-లేదని (తల త్రిప్పును.)

స:-ఆమెకడకే బొమ్మందువా?

కృ:-భర్త కావలసినచో (నని యూరకుండును.)

(సత్యభామ తలవంచుకొని చిన్నమొగముతో రుక్మిణియింటికి పోవును.)

(తెర)

## 3 వ రంగము.

(తెరయెత్తగా ఒక్కెడ యందున్న శ్రీకృష్ణుడును, నారదుడును)

నా: నటనసూత్రధారీ! మనము చేయవలసిన దానిలో చాలవరకు బాగుగనే జరిగినది. కాని యిప్పుడీ

సత్యభామాదేవి యారుక్మిణీదేవి కడకేగి యేమి జెప్పునో? యీపైన నాటక రంగమెట్లు పరిణమించునో యని మాత్రము సందియముగా నున్నది.

క:- దేవమునీ! త్వరపడకుము. అంతయు నిప్పుడే చూచెదవుగాక. రుక్మిణీదేవి పాతివ్రత్య మహిమంబును సత్యభామ గర్వపరిహారంబును ఈలోకమున కిప్పుడే చాటగలవు.

(ప్రవేశము. తులసిదళముల కండ్లకద్దికొనుచు సత్యభామాసహితయై రుక్మిణి)

రు:- భక్తజన పోషకా నమస్కారము. నారద మునీంద్రా నమస్కారము.

నా:- సుమంగళీభవ!

రు:- త్రిలోకసంచారీ! ఈకతినవ్రత చర్య నంతయు సత్యభామ వలన వింటిని. కాని, తిరిగి పతిని బడయుటకు గల సమర్థత నాకేమున్నది?

నా:- దేవీ! భక్తసులభుండును, భక్తరక్షకుండును నగు జగన్నాథుండు భక్తులకుగాక యింకెవరికి వశుడగును. నీవెరుగని దేమున్నది తల్లీ! (సగర్వముతో సత్యభామను జూచును.)

(సత్యభామ కన్నీరు నింపుచు తలవాల్చును)

రు:- (నారదునిగని) దేవా! ఈతక్కెడయందుగల ధనమెల్ల దీయింపుము. (నారదుడట్లుచేయును.)

రు:- (హరి, తులశులను మనమున ధ్యానించి) పరమపావనీ, బృందామతల్లీ! నీమహిమంబు లద్భుతంబులుగదా! మనోవాక్కాయములచే నిన్ను నమ్మినవారి నెమ్మనమ్మున నిల్చి యుందువుగదా! తల్లీలోకపావనీ!

హరిసమానంబు నీ మహాత్యంబటంచు
నెమ్మదిని తులశమ్మ నిన్న మ్మితమ్మ
ప్రాణవిభునిచ్చి మమ్మ్మగాపాడవమ్మ
తూగుమా పతితోసరి తులసిదళమ!

(తక్కెడలో తులసిదళము వేయ
కృష్ణుడు తేలిపోవును. పైనుండి పుష్పవర్షం.)

( తెర )

సమాప్తం

# బొమ్మల కొలువు



శ్రీమతి మల్లవరపు హనుమాయమ్మగారు (బి. ఏ. విద్యార్థిని)

అది శ్రీ కాళహస్తి తాలూకాలోని ఒక గ్రామము. అచ్చట ఒక బ్రాహ్మణ కుటుంబము కలదు. వారికి ఆ గ్రామములో ఒక సొంతయిల్లు, కొన్ని ఎకరముల భూము లున్నందువలన, వారు పట్టణవాసము నుండివచ్చి అచ్చటనే స్థిరముగా నుండిపోయిరి. వారికి ప్రతిసంవత్సరమును నవరాత్రిదినములలో బొమ్మలు పెట్టు నలవాటు. ఆ అలవాటు తప్పకుండా నుండుటకును ఏదో ఆ గ్రామప్రజలుకూడ ఆ వేడుకలు చూచి సంతోషించెదరను భావముతోను ప్రతిఏటను బొమ్మలు పెట్టుచుండిరి.

క్రిందటి సంవత్సరముకూడ మామూలుగా ఏడెనిమిది అంతస్తులలో బొమ్మల రమణీయముగా నమర్చిరి. వాటికెదురుగ గచ్చుతో కట్టబడిన ఒకకోనేరు. దానిలో రబ్బరు చాపలు, బాతులు, కప్పలువేసిరి. ఆ కోనేటిచుట్టూ మెత్తని ఇసుకతోటి తిన్నెలు వాటి అంచునంతా పచ్చని రాగిపైరు. ఒక పెట్రమాక్సులైటునుకూడా వెలిగించిరి. ఆ కొలువు చూచుటకెంతో కన్నులపండువుగను మనస్సున కాహ్లాదకరముగను నుండెను.

ఇక చెప్పేదేముంది! సాయంత్రమగుసరికి గ్రామములోని గృహలక్ష్ములందరు వారి వారి సంతానముల చంకనిడుకొని బొమ్మల వేడుక చూచుటకై వచ్చిరి.

పాపము! వారిట్టివింతల నెప్పుడు చూచి ఉండరు కాబోలు! ఆ గృహము గ్రామ బాలబాలికలతోసహా క్రిక్కిరిసియుండెను. పిల్లవాండ్రు కండ్లు మూస్తూ తెరుస్తూ, నోరు తెరచుకొని లైటును చిత్రంగాచూస్తూ చప్పట్లు కొట్టసాగిరి.

వారిలో ఒక స్త్రీ "ఒకటీ, రెండూ, మూడూ..........ఎనిమిదంతస్తులా! 'మ్మె మ్మెనెమ్మా! ఆశేసూడే నాయమ్మా! ఎంతాపెద్ద నాగుబాముపడగే తల్లో! ఎన్ని శిరస్సులేయమ్మా! ఆ సుట్టసుట్టుకొని ఉండే పాముమీద పండుకోనుండే ఆయన ఎవరమ్మే?" "ఆ అదికూడ తెలవదటమ్మె నీకు! ఆయనేనమ్మా మహా ఇష్ణువ. ఆయన కాళ్ళకాడుండేదే మహాలచ్చిమి."

"ఓ చిన్నమ్మే! రెండో అంతస్తులో సూడమ్మే! ఆ నడాసుండే బొమ్మ రాముల వారు. ఆ పక్క లచ్చుణసామి. ఈ పక్కేమో సీతామ్మోరు. ఇంకేంచేసేది కూతరా! ఆ ఆంజనేయసామిని సూడే! అంతా కోతున్నట్టున్నాడు. ఈటనన్నిటినీ ఎట్టా అచ్చు లేసుంటారో వాడినం?" అని మరొకస్త్రీ ముక్కున వ్రేలిడుకొని పకపక నవ్వెను.

ఒక పిల్ల తన తల్లి చీరలాగుతూ "యమ్మల్లా" మ్మె! అదుగోనమ్మె 'ఈండ్రోడు తాటిచెట్టెక్కతాను. అద్దో! ఆడ కల్లుముంతకుండా!' అని ఆ బొమ్మకేసి చూపును. సరే

ఒక ముసలి అవ్వకు ఆ లైటు ముందర కండ్లు చెదరిపోవుచుండును. నవ్వుకొంటూ బొమ్మలకేసి చూస్తూ "ఓ అంకో! 'ఆచాకలోడు చాకల్దాని' బొమ్మలు సూడేకూతరా! అంతా మనూరి చాకలసుబ్బడూ, చెంచున్నట్లున్నారు. ఎంతపెద్దమూట మోస్తుండావురా సుబ్బా! ఆ ఈళ్ళపుణ్యాన ఇద్దైనా చూస్తుండాము. లేకుంటే మనమేందమ్మా 'పట్నాసాలకు' పోయి సూసొచ్చేది!" అని ఆ బోసినోటితో ఆ యింటివారిని తలచుకొనును.

మరొకస్త్రీ శాంతమూర్తియగు 'గాంధీమహాత్ముని' బొమ్మచూచి ఒకపాగాకు కాడును వడత్రిప్పుతూ "ఏం నాగమ్మా! ఆ ముసలాయన బొమ్మెవరమ్మే? ఎంత నవ్వో తల్లా ఆయనకు!" "యామోనమ్మా మనయ్యోరి నడిగితే తెలస్తాది." (ఇంతలో ఆ యింటి యజమానుడు లోపలికి వచ్చెను) వెంటనే "యాం సామి! ఆ తాతెవరయ్యా" అని ఒకస్త్రీ ప్రశ్నించును. "గాంధీమహాత్మ డంటారే ఆ మహానుభావుడే ఈయన" "ఆ! ఈయన్నేనటయ్యా! ఆ...ఎవడో గుండుతో చంపేశిందీ? ఆడికి... చేతులెట్లాడాయో కూతరా! అయ్యోరామ! ఆ పబువు ఉండుంటే ఇంకా మనకెంతెంత సహాయం చేసునోకదా? ఆ ఇంకా చంపినోడు మట్టుకేం సుకపడ్తాడులే" అని కన్నీరు నింపుకొనును.

"అదిగోనమ్మే పైనబోయే మోటారు!" (విమానంహూచి) "అల్లదిగోనే దొరా, దొరసాని బొమ్మలు! అద్దో ఆ బొమ్మేమో ఇగ్నేసరుడు. ఎంతపెద్ద పొట్టయ్యానీకు? అద్దోనమ్మా ఆయనకాడా 'ఎలిక' కూడాను. ఈ దిగవ మెట్లో వుండేది 'ఈస్పరయ్యా'. ఆ యమ్మేమో పార్వతీదేవి.

ఇంతలో కొంతమంది హరిజన గృహలక్ష్ములు, పురుషులు గ్రామములో బొమ్మలవేడుక చెప్పుకొనుటవిని వారివారి బిడ్డలతోపాటువచ్చి ఆ గృహమునకు కొలది దూరములో నుందురు. వారిలో బందిలి రాగడనే వాడు "యామమ్మా సుబ్బమ్మా! యాడమ్మా తల్లే బొమ్మలట? మమ్మలకూడ కాస్త సూణ్ణీయమ్మా! పొద్దట్నుంచి మావోడు బొమ్మలకాడికి పోదాం రాయే అని సంపతుండాడు" అని ఆ ఇంటి యజమానురాలికై ఎలుగెత్తి అరచును. ఆ ఇంటి యజమానుడు అప్పుడే బయటికి వచ్చెను. "యాం సామి! దండాలు, దండాలు. యాందోనండి; యేడుక సూసి పోదామని వచ్చాం నాయనా! ఈ పిల్లోళ్ళతో ఒకటే రబసంగా వుంది." సరే ఆ యింటి యజమానురాలుకూడ బయటికివచ్చెను. ఆమె కొంచెం పూర్వాచార పరాయణురాలు. వచ్చీరావడంతోటి "ఏం రాగా! నువ్వుకూడా ఈతీరుకొచ్చేదేనా? ఇంటిమీది కెగబడి రావడమేనా పని; కొంచెం చిన్నాపెద్దా ఉండొద్దట్రా; అట్లుంటేనే

దేవుడుకూడా మెచ్చుతాడు నాయనా! నేను మడికట్టుకోనున్నాగానీ ఇంకా కొంచెం అట్ట నిల్చొనిచూడండి. బొమ్మలు బాగ్గనపడతాయ్'' అని అంటూ లోపలికి వెళ్ళెను.

ఆ ఇంటియజమానుడు "రే రాగా! నేనుకూడా లోపలికెళ్తున్నాగాని ఇంకా ఇట్టొచ్చి బాగాచూడండి. అయినా పాపం మీరుమాత్రం ఈవేడుకలెక్కడ చూస్తారులే".

కుక్కపిల్లలు కనబడడంతోటి వారిలో ఒక స్త్రీ "మ్మే పోలో! అయిగో, అయిగో కుక్కపిల్లలు! యెంతంత పిల్లలేతల్లా! యెంత తెల్లగుండాయే! అల్లదుగోనమ్మో జత కాకులు! ఆడసూడే ఒకన్న పామాడిస్తాను! యాడమ్మో గాంధీమాత్ముడి బొమ్మ? మ్మే లోపలికి పోతే ఇంకా యేశుగ్గా వుంటాదేమో!"

"అల్లదుగోరా యఱ్ఱబుట్ట పెట్టుకోని పోలీశోడు. అదుగో కిట్టమూర్తిబొమ్మ. అట్టాటి యాసమే గదటమ్మ మొన్న మన 'మాలాడకాడ యేస్ని బాగోతంల్లో యేసింది మన పోలుగాడు." అని ఇంకా ఏవేవో బొమ్మలపేర్లు చెప్పుకుంటూ కిలకిల మని నవ్వుకొంటూ వెళ్ళిపోవుదురు.

ఆ ఊరి పెద్దరెడ్డిగారు కూడ వత్తురు. లోపల గ్రామప్రజలింకను వేడుక చూచు చునే యుందురు. ఆయన వచ్చిరావడంతో "అబ్బో బలేవున్నాడే కోమటాయన! ఆహా! ఎంత బాగుండాయయ్యా నీ నామాలు. అయితేకూడా ఇంతపొట్టటయ్యాకేకు? అంగట్లో ఉప్పూ, పప్పూ, మిరపకాయలు, చింతపండు, మొక్కజొన్నల పిండి, గెనుసు గడ్డలు, అన్నీవున్నాయే! అరే తాటిముంజలు కూడానా తట్లో! మెరిగెలు, గిన్నెలు, కూజాలు, రకరకాల గాజులు సమస్తం వున్నాయ్ కదటయ్యా! ఎన్ని రేవన్లొస్తే మట్టుకేం! ఒరే, ఒరే! శెట్టిగారి లెక్కల్ రాయడానికి గుమాస్తాకూడానా వక్కన!

ఏం శెట్టి! దొంగమార్కెట్ల సంగతికూడ బాగా తెలుసునుగదటయ్యా నీకు!" అని పడీపడీ నవ్వెను. సరే గ్రామప్రజలుకూడ ఆయనతో పాటు నవ్విరి.

వీరంతా ఈ విధంగా ఉంటే వచ్చిన బ్రాహ్మణ ముత్తైదువులలో నొకరు "ఏం వదినా! ఆ కొళాయినీళ్ళు పట్టావుండే బొమ్మ బాగుంది కదూ? ఆ బొమ్మ చీర రంగుకూడ చాల బాగుందిలే; అదుగో ఆ ప్రక్క చూడండి వదినా! ఒక ఆడ బొమ్మ మిషన్ కుట్టుతూంది!" ఇంకేం

"గౌరికల్యాణా వైభోగమే
కూర్చుండు మహాలక్ష్మి కూర్చుండవమ్మా
కూర్చుండు వీరింటి కుర్చీల మీద"

అని పాడుతూ బొమ్మలకు హారతిత్తురు. వారిలో ఒక అమ్మాయి, "వినతాసుత వాహనుడై" "మీవల్ల గుణదోషమేమి" అను పాటలు అన్ని రాగములతో ఒళ్ళంతా త్రిప్పుతూ పాడి పూర్తిచేయును. తాంబూలం తీసుకొని వారు వెళ్ళుదురు.

ఇంటి యజమానురాలు బొమ్మలకు నైవేద్యం పెట్టిన గుగ్గిళ్ళను, వచ్చిన వారికి తలా పదేసి గింజలు చొప్పున పంచును (రేషన్ కాలం గదటండీ!)

"ఓ సుబ్బమ్మో! నాకు పెట్లేదమ్మో—మ్మో—మ్మో ఈడమ్మా ఈడ" అని ఒక పిల్లవాడు. "పోవుంరా నాయాలా. నాను పెట్నేరా ముందుగాను. రే! ఇది మన ల్లు కాదురో! అంత పడబాకబ్బే అప్పుడేనో!" అని ఒకరినొకరు కొట్టుకొందురు.

"ఓ పిన్నే నా అమ్మికి రెండుగింజలు పెట్టమ్మో" అని ఒక స్త్రీ తన బిడ్డ చేతిని ముందుకు చాపును.

"ఒరే నన్ను తాకేరురా! ఏందబ్బా, ఈరచ్చ! పదండ్రా వారగాను! ఇదిగో ఇట్లరచివారంటే అంతానెత్తిన కుమ్మరించి పోతా" అని మధ్య మధ్యన ఆ యింటి యజమానురాలు అరచును. ఎట్లాగో పడుతూలేస్తూ ఆ దొరికిన గింజలతో తృప్తిపడి "రే! రేపుగూడా రావాల్రా ఈడికి" అంటూ వారివారి గృహములకు వెళ్ళుదురు.

పాపము! ఆ గ్రామములోని గృహలక్ష్ములందరు ఇదే విధముగా నవరాత్రి దినము లన్నియు వేడుకతో గడిపిరి. సాయంత్రంపూట వచ్చుటకు తీరికలేని గృహలక్ష్మిలు ఎట్లనో సందుచేసుకొని పగలుపూట వచ్చి బొమ్మలచూచి పోవుచుండెను. ఎట్లైనను వీరందరు కష్టజీవులు. ఉత్త అమాయకులు. వీరందరిని మహోన్నతస్థితికి తెచ్చుటకు విద్యావంతులెల్లరు మిక్కిలిగా పాటుపడవలయును. గ్రామసౌభాగ్యమే దేశసౌభాగ్య మనునది ప్రతి వ్యక్తియు మనస్సు నందుంచుకొనవలయునని ప్రార్థన.

# ★ కూరగాయల సంభాషణ



♦ రొయ్యూరు ప్రమద ♦



ఒక రైతుకు మంచి తోటభూమి. దానినిండా పళ్ళచెట్లు, చాల రకాల కూరగాయల మళ్ళూ, ఉన్నాయి. చూడ్డానికి వచ్చిన వారిలో కొందరు ఇన్ని రకాలు పెట్టుకుంటే "ఇబ్బందికదూ! కొన్ని కూరగాయ పైర్లు తగ్గిస్తే సుళువుగా వుంటుంది" అన్నారు. "సరే మళ్ళీ పంటకు చూస్తాను" అన్నాడు రైతు. ఈ మాటలు విన్నాయి కూరగాయలు. ఎవ్వాళ్ళు వెళ్ళిపోవలసి వస్తుందో అని విచారించాయి.

నేను ముఖ్యమంటే, నేను ముఖ్యం అన్నాయి. అలా కాదు. మనమంతా కలసి చర్చించి మనగొప్ప చిన్న భేదాలు తేల్చుకోవాలనుకున్నాయి. కేబేజీ గార్ని అధ్యక్షులుగా ఎన్నుకున్నాయి. కాలిఫ్లవర్ గార్ని కార్యదర్శినిగా చేసేయి.

### అధ్యక్షుడు

కూరగాయ సోదరులారా! మనమంతా యిప్పుడు ఎందుకు సమావేశమయ్యామో మీకందరికి తెలిసిందే. యజమాని కొన్ని పైర్లు తీసివేస్తానంటున్నాడు. మీ మీ ప్రాముఖ్యతలగూర్చి మాట్లాడితే కమిటీవారు శ్రద్ధగావిని ఆలోచిస్తారు. కార్యదర్శినిగారు మీపేరు పిలిచినప్పుడు మీరులేచి మాట్లాడవలసి వుంటుంది.

### కార్యదర్శిని

వంకాయగారు మాట్లాడుతారు.

### వంకాయ

నేను పురాతనంనుంచీ ఉన్నాను. నన్ను వంట చేసేపద్ధతులు ప్రతి ఆవిడకు తెలుసు. నన్ను పైరు చేయడానికి అట్టే శ్రమ అక్కరలేదు. ఇన్నిగింజలు నారుపోస్తే ఎకరానికి సరిపోతుంది. మొక్కపాతేక నన్ను గురించి ఎక్కువశ్రద్ధ తీసుకోకపోయినా ఫలసాయంవస్తుంది. నా కుటుంబం చాల పెద్దది. కొందరు నీలం కొందరు తెలుపు. కొందరు, మెట్టవారు, కొందరు నీటివారు, కోడిగుడ్డు ఆకారంవారు కొందరు. నా తలమీద చక్కటి కిరీటం చూచారా? నేను కూరగాయల్లో రాజుని. అందుకే నన్నుగూర్చి కవి ఏమన్నాడో చూచారా?

"వంకాయవంటి కూరయు
పంకజముఖి సీతవంటి భామామణియున్,
శంకరునివంటి దైవము
లంకాపురివైరి వంటి రాజునుగలడే"

### కార్యదర్శిని

వంకాయగారు యింక చాలించాలి. బెండకాయగారు యిప్పుడు మాట్లాడతారు.

### బెండకాయ

నన్ను ఎరగని ఇల్లు, ఇంటావిడవుండరు. నా వేపడం, పులుసు తినని మనిషి వుండరు. సాగుచేయడానికి ఏమీ కష్టంలేదు. రెండుగింజలు పాతితే చప్పున ఎదిగి రోజువిడిచి రోజూ కాయలిస్తూ కొంత కాలంపాటు ఎదుగుతుంటాను. నా అందాన్నిచూచి నాకు ఇంగ్లీషులో "నారీమణుల చేతివేళ్లు" అని పేరు పెట్టుకొన్నారు.

### కార్యదర్శిని

ఇక తోటకూరగారు మాట్లాడాలి.

### తోటకూర

ఆకుకూరలేనితోట, ఆకుకూరలేని వంట అసంపూర్తియని నేను చెప్పనక్కరలేదు. ఆకుకూరల ఆరోగ్యం డాక్టర్లే చాటి చెప్పుతున్నారు. ఇంతమడి గట్టి చల్లుకుంటే చప్పున కూరకువస్తాను. ఇంకా ఎదగనిస్తే చక్కటి తోటకూర స్తంభాలు (కాడలు) ఇస్తాను.

నా పెద్దతండ్రి బిడ్డలు కొందరు, పినతండ్రి బిడ్డలు కొందరూ వున్నారు. కొందరు పచ్చన,

కొందరు ఎరుపు. చుక్కతోటకూర వగైరాలంతా మా దగ్గర చుట్టాలు. తాతాచార్యులుగారికి నా మీదనున్న మక్కువ కనిపెట్టి తెనాలి రామన్న ఆయన్ని గోతిలో దించేడు. కీర, అంటే ఎరగని తమిళ వనిత ఆకుకూర, అంటే యెరగని ఆంధ్ర వనిత లేదంటే అతిశయోక్తిగాదు.

### కార్యదర్శిని

తరవాత టర్ను టొమేటోగారిది.

### టొమేటో

విటమిన్ల ప్రాముఖ్యత ప్రపంచానికి తెలిసేక, నా సంగతి తెలిసింది ప్రపంచానికి. మా దేశంలో నన్ను పులుసు చేసుకుంటారుగాని, ఇంగ్లీషు దేశంలో నన్ను ముక్కలుగాతరిగి పళ్లముక్కలేతింటారు. జబ్బు మనుష్యులకు, పిల్లలకు పెడతారు. ఎంతో ఆరోగ్యమని ఎన్నో మాదిర్లుగా నన్ను వుపయోగిస్తారు. మాదిచాల పెద్ద కుటుంబం. గోలీకాయలంత సైజునుంచి గుప్పెడేసి కాయలిచ్చేవాళ్ళు. మావాళ్ళు ఎన్నో రకాలు వున్నారు. టొమేటోలేనితోట, టొమేటో లేని కూర అంగడిలేదని నేను చెప్పనక్కరలేదు.

### కార్యదర్శిని

తరువాత అరటికాయగారు.

### అరటికాయ

ప్రపంచములో నాకంటె పురాతనమైన కూరగాయ లేదు. నేను పైరు కాని దేశంలేదు. తక్కువ కృషితో ఎక్కువ ఫలసాయం యివ్వటం నా మతం. ఎకరానికి 20 టన్నుల పంట యిస్తాను. అంటే బంగాళా దుంప పంటకు 4½ రెట్లు, గోధుమ పంటకు 33 రెట్లు అన్నమాట. బజారులో నన్ను కూరగాయలాగ, పండులాగకూడా వాడుకుంటారు. అరటికాయ, అరటి ఆకులేని శుభకార్యంగాని, తద్దినంగానివుండదు. క్రిమి వగైరాలు నన్నేమి చేరకుండా చక్కటి దైవనిర్మితమైన తొక్కలలో నాగుంజు భద్రపరచబడివుంటుంది. నన్ను ఇంటి ఆవిడ అనేక విధాలుగాకూరచేస్తుంది.

### కార్యదర్శిని

ఇంక ముల్లంగి దుంపగారు రావొచ్చు.

### ముల్లంగి

ముల్లంగి అంత సులువుగా పైరయ్యే కూరగాయ-

(అంతలో వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటరుగారు వచ్చేరు.)

### వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటర్

ఏమిటీ తెలివి తక్కువ తగాదాలు! వాదాలూ? అల్లుల్లో మల్లు పెద్ద అని మీ కేబేజీగారి అధ్యక్షతా వద్దు, కాలీప్లవర్ అమ్మగారి కార్యదర్శకత్వమూ వద్దు. ఇప్పుడు ప్రజలకూ ప్రపంచానికీ కావలసింది మండే పొట్టకు మరిగేజావ, అన్నట్టు ఇంత తిండి, ఇన్ని కూరగాయలూను. ప్రతీకూరగాయకు సమానస్థానంవుంది. దేనిగొప్ప దానిదే. మీ రైతు మిమ్మల్ని శ్రద్ధగా సాగు చేస్తువున్నంతసేపు, మేము మీ విత్తనాలు సప్లయి చేస్తూ, పట్టే తెగుళ్ళు పురుగుల బాధలునూన్ని చక్కగా పాకుతున్నంతసేపు మీకెవ్వరికీ వెళ్ళిపోవాలన్న భయం అక్కరలేదు. రైతుతో నేను చెపుతాను. ప్రపంచానికి కావలసింది తిండి, కూరలు, పళ్ళు. ఇంకా, కూరలు-కూరలు-కూరలు.

# ఇంట గెలచి



ఎ. పేరింకుమారి.

సోదరీ,

"నారీ లోకాన్నుద్ధరించటానికి మనమందరం నడుంకట్టిముందుకు నడవాలి. పురుషులు చేసే అక్రమాలనూ దౌర్జన్యాలను అరికట్టి, 'స్త్రీ బానిస' అనే దురభిప్రాయాన్ని నిర్మూలించి 'అబలలుకాదు సబలలోయ్ !' అని ఎలుగెత్తి చాటాలి. ప్రతి స్త్రీ విద్యాభ్యాసంచేసి స్వయంపోషకత్వానికి సంసిద్ధయై పురుషుని స్వార్థానికి గొడ్డలి పెట్టుపెట్టాలి. స్త్రీ ఆటవస్తువుకాదు. ఆయువుపట్టు సంఘానికని తెలియజెయ్యాలి. సంఘంలోని కుళ్లునుకడిగి స్వార్థపూరిత హృదయులైన సంఘపెద్దలను సంస్కరించాలి. దీనినే పత్రికలద్వారా ప్రచారం చేయాలి."

పైమాటలు నీకు పరిచిత వాక్యాలైయుంటాయి. ఆ రోజున విద్యుత్ దీపకాంతులచే తళతళమెరసే హాలులో పాశ్చాత్య నాగరికత జీర్ణింపజేసికొని హైహీల్డు జోళ్ళతో కళ్ళకు అద్దాలు, పెదిమలకు రంగు, ముఖానికి పౌడరుపులిమిన నీవు ప్రాచీన భారత సంస్కృతినే సంస్కరించటానికి సిద్ధపడ్డావ్. ఆవేశంగా కొన్ని పురుషద్వేష వాక్యాలను పల్కగానే నారీలోకం నీకు గౌరవస్థానాన్నిచ్చింది. కాని నిజం తెలుసుకొని చెప్పటానికి చేయటానికి ఎంత తారతమ్యం వుందో తెలిసికొనే విజ్ఞానంమాత్రం మాకు తక్కువయింది.

పై వాక్యాలను తలచికొంటే నీలో ఎంతవిజ్ఞానం యిమిడి వున్నదో, నీ హృదయం ఎంత విశాలమో నీ ఆదర్శాలు ఆశయాలు ఎంత మహోదాత్తమయినవో అర్థమవుతుంది సభలోని నారీరత్నాలకి. అందుచేతనే నీకు సమస్తగౌరవాలు జేసి ఊరంతా ఊరేగించి పత్రికలనిండా నీ పేరు మార్మోగించారు.

కాని నాకు, నీ తోటిస్త్రీకి నీ సోదరీమణికి నీవుచేసిన ద్రోహం హాని, అపకారం, నీవు చేసిన చర్యలవల్ల అర్థమవుతుంది. ఇక్కటిలోకానికి తెలియని ఘోరపాపాన్నాచరించావ్.

నీవూ విద్యావతివే. విశాలభావాలు హృదయలో చిక్కబట్టుకొని అజ్ఞానంచే కప్పబడిన భారతి నారీలోకాన్ని, స్వార్థపరత్వంతో నిండిన మానవహృదయాల్ని సంస్కరించటానికి సిద్ధపడ్డావ్.

కాని నీలోని స్వార్థాన్ని అణగ ద్రొక్కుకోలేక పోయావ్ ! నిస్సహాయవా ? అబలవా ? మరి సబలలు కండని అరుస్తావెందుకూ !

చిన్ననాటినుండి వలచి వలపించుకొని వివాహం చేసికొన్న నా ప్రాణప్రియుని చేత పట్టడానికి సంకించని విశాల హృదయం నీది.

పండువంటి నిండు సంసారాన్ని గంగలోకిద్రోసి నీ కుచ్ఛితప్రేమచే, విషపువలపు తూపులచే నా 'భర్త'ను నీ వశంగా వించుకొనిన సబలవు'' నీవు!

విజ్ఞానం పేరుతో పాశ్చాత్యవేష భాషలవెనుక దాగికొన్న నీ కుచ్ఛిత హృదయం నుండి వెడలే విషపువాంఛలచే నా కారుణ్యమూర్తిని నీకౌగిటిలోనికి తీసికొన్న విద్యావతివి!

పసిపాపలతో నిండిన నాపచ్చని కాపురానికి చిచ్చుపెట్టకు; నాప్రేమలతనుత్రుంచకు మని కన్నీటి కాల్వలచే నీ పాదాలు తడపగా వాటి తాకిడిచే నాశిరస్సును పవిత్రంచేసిన స్వార్థరాహిత్య గృహలక్ష్మివి!

పిన్నవయిస్సులోని పిల్లలతో ఎడపాలుత్రాగే పసిపాపతో నన్ను ఆకలి దేవత అండ జేరనివ్వవద్దని, నా గౌరవాన్ని, మానాన్ని వీధినిపెట్టక నీ పంచనీడలోనే, నా పతి సేవ చేస్తూనైనా జీవింప యనుమతి యిమ్మని ఎంత బ్రతిమాలిననూ కరుడుగట్టి, కరుగని హృదయంనీది! సోదరి కన్నీటికాలువలు వెల్లువలై ప్రవహిస్తూంటే, ఆకలిబాధను ఓర్వలేక 'అన్నం పెట్ట'మని ఏడ్చు పసిపాపల ఆర్తనాదాలు ప్రతిధ్వనిస్తూంటే, నీరసంచే బక్క-చిక్కిన శరీరంమీదపడి రోదనచేసే పసిపాప ఏడ్పువింటూ, అగ్ని సాక్షిగా వివాహ మాడిన నా పతిని నానుండి ఎడముచేసి, వానితో నీవు కులుకుతూసుఖిస్తావ్! నీ ఆనందం, సౌఖ్యం తోటి సోదరి ఆర్తనాదాలలోనూ, పసిపాపల ఆకలిబాధలలోనూ!

మూడు దినాలై జ్వరపీడితయిన నా పసిపాప, ఆకలిభాదల కోర్వజాలని మా చిట్టి పాప, భర్తృ రహితనైననేనూ త్వరలోనే కాలగర్భంలో కలుస్తాం! కాని నీ విష హృదయం యింకా ఎంతమంది నిండుకాపురాల్ని నేలగూల్చి వాళ్ళ అశ్రుధారలు అవనిమీద గడ్డకట్టిస్తుందో!

విజ్ఞానం పేరుచే అజ్ఞానులమోసగించి, స్వార్థాన్ని పోషించుకొంటూ నారీ లోకాన్ను ద్ధరిద్దామని డాబులుకొట్టే పయోముఖవిషకుంభా లెంతమందో!

'స్త్రీ' స్వతంత్ర అవ్వాలంటే పురుషదాస్యంనుండి తప్పించుకోవాలంటే ఈ విషకీటకాల్ని విదలించాలి. సోదరీ! ఆవేశంతో వ్రాశాకాని నీ హృదయం మారు తుందనే ఆశలేదు.

ఇట్లు, అశ్రుపూరిత నయనాల్తో, నీ సోదరి.

## వ్రజకాంత



విద్వాన్ : ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్య సోమయాజులు గారు.

వేఁకువనిద్రలేచి నులివెచ్చనినీటను దానమాడి ప
చ్చాకులచీరగట్టి కడునందపు వన్నెలరైకదాల్చి భూ
షాకమనీయనై కుసుమసౌరభము ల్వెలిఁజిందనెత్తిపైఁ
ప్రాకటదుగ్ధభాండమలరన్ మధురాపురిరాజవీధికిన్.

ఓలిన్ దిర్గుచుఁ గంఠమెత్తి వెసఁ బాలోయమ్మరో పాలు, పాల్
పాలంచున్ బలుమాఱు కేకలిడుచున్ బ్రత్యాలయద్వార సీ
మాళిందస్థలులందు నిల్చుచు జనంబాలింప నేనమ్ముచో
నాళీకాప్తుని మండలమ్ము నడిమింటన్ జేరి పేరుక్కునన్.

నిప్పుల రాల్పఁజొచ్చె నన నిల్చి ప్రచండతరంపు టెండలన్
గుప్పుచునుండఁ జల్వలను గూర్చెడు టెంగటితోపుఁ జేరి నే
రొప్పుచుఁ గూర్చున్నతఱి శ్రోత్రపుటమ్ముల సోఁకె నిర్వృతిం
జిప్పిలఁ జేయు హాయి విలసిల్లఁగఁ బిల్లనఁగ్రోవి రావముల్.

తన్మహనీయరావమునఁ దన్మయతం గనె మన్మనంబు తో
నన్మొగిడెం గనుంగవయు నన్నొక వింతప్రవృత్తి యెంతొ లా
గన్మతిదప్పి యెప్పటికొ కన్దెఱువం గనుపట్టె విశ్వమె
ల్ల న్మరిపించు మోహనకళల్గల బాలకుఁ డాలఁ దోలుచున్.

నోటఁ బిల్లనఁగ్రోవి నెన్నొసట మృగమ
దంపుఁ దిలకమ్ము పింఛమ్ము దలను బొందల
కలువలం గెల్చు మైడాలు కల జగాల
నేలునో యన నవ్వరాకృతి వెలింగె.

ఆ సువిలాసవిగ్రహ మహత్తర సారకళాసముద్ర వీ
చీసముదాయ మధ్యమునఁ జిక్కి మునుంగుచుఁ దేలుచుం బ్రహా

ర్షాసమలీల నెంతదడవట్టుల యుంటినొకాని "లేవవే
లా? సఖిదిశఁ జేరెరవి" యన్నడి విన్నటులయ్యె నయ్యెడన్.

అంతఁ మేల్కొని నల్దెస లరసి చూచి
యిరులు చుట్టును గప్పుచో వ్వేనుదెలిసి
ఔర! యిదియేమి? యిట్లైతి నన్న తలఁపు
ముట్టవడిలేచి నిలయాభిముఖిత వెడలి.

నడచుచునుండ వెండియును నాకలతొల్లిటి విగ్రహంబెదం
దడఁగనుపట్టె డెందమున నాటుకొనంగ నయారె! తెల్విఁ గో
ల్పడియిరులన్న మాటయును బాటయునన్న విధమ్ము మాలిమె
ప్పుడొ కడకట్టులో దరియఁబోయితి నయ్యమునా సరిత్తటిన్.

ఏటిజలములఁ బూఁబొదరిండ్ల గట్ల
దరుల గిరులను గ్రిందనూర్ధ్వమునఁ జుట్టు
నెందుఁ గనుగొన్నఁ దద్వరాకృతియె తోఁచి
యనుపమానంద పారవశ్యముల ముంప.

ప్రశమంబంచని తన్మయత్వయుతనై స్వైరక్రమం బేర్పడన్
భృశభాషావళి గీతికావళి లసత్క్రీడావళిం దేల నా
నిశయుం జీఁకటు లేను నిజ్జగమునుం జింతింప నేమైతి మో
విశదంబుం బొనరింపఁజాల నది స్వప్నీభూత వృత్తాంతమో!

# ★ వేమన పద్యాల అనుకరణం 

పాండ్సుక్రీము రాయ పడతి కందము రాదు
లక్సుసోపురాయ లావణ్యమది రాదు
పుట్టుసారము లేక పెట్టుసారము రాదు
విశ్వదాభిరామ వినుర వేమ.

ఖద్దరును ధరించ కాంగ్రెసు కాదయా
సుత్తికొడవలిబట్ట కమ్యునిష్టు కాదు
వేషమేయగాని సాని సంసారౌన
విశ్వదాభిరామ వినుర వేమ.

సాధనములుజూంచి సంగీతమనరాదు
నేర్చి పాడవలయు దీటుజూపి
లేద, కీచురాయిపాడును చక్కగా
విశ్వదాభిరామ వినుర వేమ.

బియ్యేవానితోడ వియ్యమందగ దలచి
కట్నమీయలేని కన్నవాడు
అందకత్తెగాని అమ్మని చదివించె
విశ్వదాభిరామ వినుర వేమ.

భర్తచావగాని భార్యవెధ (విధ) వయౌన
పసుపు కుంకుమ తాడు తీయగాని
మనసు విధవగాక మనిషి విధవ కాదు
విశ్వదాభిరామ వినుర వేమ.

 పూర్ణావతి 

# లలిత ప్రతిజ్ఞ




శ్రీమతి నెమలి చంద్రమతిదేవిగారు

లలిత పదిహేను ఏండ్ల బాలిక. చక్కగ దిద్దిన ముక్కు, తామ రేకులవంటి కండ్లు, తీర్చినకను బొమలు, నల్లని పొడుగైన తలవెంట్రుకలును, చామని చాయ గలిగి యుండెను. సుగుణవతి, వయసుకు తగిన చదువు, సంగీతమును నేర్చుకొనుచుండెను.

లలిత తండ్రి మాధవరావుకు, ఒక బ్యాంకిలో పని. మూడువందలు జీతం. అతని సంతానం లలితగాక, ముగ్గురు కొడుకులు. ఆడపిల్ల వక్కతే గనుక లలిత అతిగారాబముగ పెరిగింది. పిల్లకు పెండ్లివయసు వచ్చిందని, మంచి సంబంధం కోసరం వెతుకుతూ వుండిరి.

మాధవరావు భార్య సుందరమ్మకు మేనత్త కొడుకు గోపీనాథ్. ఇరవై సంవత్సరములు వయసు. బి. ఏ. ప్యాసయి వుద్యోగ ప్రయత్నం మీద వుండెను. మనిషి, ఒడ్డుపొడుగ్గా చూచుట కందంగావుండెను. తండ్రి సంపాద్యం, కొంతభూమి, ఒకపెద్ద యిల్లువుండినది. మాధవరావు అంతాచూచి చూచి ఆఖరుకి యీ సంబంధమే మేలని తలచాడు. సుందరమ్మ కూడా వొప్పుకుంది. లలిత యిదివరకు గోపీనాథుని చూచింది. గనుక అతడే తన భర్త కానున్నందుకు చాలా సంతోషించినది. చిన్న తనంలో యిద్దరు కలిసి ఆడుకుంటూ వుండేవారు. తన పెండ్లయిన తరువాత ఏఏవిధంగా తనజీవితం గడుప వలెనో అదంతా ఆలోచిస్తూ, ఆనందిస్తూ వుండేది.

మాధవరావు గోపి తండ్రికి, తనకుమార్తెను గోపి నాథుకు యిస్తామని, అంగీకారమైన, తక్షణమే బదులు వ్రాయమని ఒకవుత్తరం వ్రాశాడు. వెంటనే తమ అంగీకారము తెలుపుతూ ఒకలేఖ వచ్చింది రామనాథరావు దగ్గరనుంచి. ముహూర్తం శ్రావణ మాసంలో ఒకశుభదినము చూచి నిశ్చయ పరిచారు.

♦ ♦ ♦

లలిత గోపీనాథుల పెండ్లయి, రెండేండ్లయింది. లలిత కాపరానికొచ్చి సంవత్సరమైనది. అత్తగారు, మామగారు తమ కోడలి వినయ విధేయతలతో కూడిన నడవడిక చూచి, ఎంతో ముచ్చట పడుచుండిరి. గోపీనాథ్‌కు పనియింకా ఎక్కడ దొరకలేదు. అయినా తన తండ్రి సంపాదిస్తున్నాడు. కాబట్టి తనమీద సంసార భారం పడలేదు.

ఆలు, మగలు సంతోషంగా కాలం గడుపుచుండిరిగానీ లలితకు మాత్రం మనసులో ఒకప్రక్క తన భర్త ఏవిధమైన ఉద్యోగానికి గట్టిప్రయత్నం చేయక ఆదాయభారం మామగారి మీదనే వేసి తాత్సారంగా వూరకున్నారే అనిచింతిస్తూవుండేది.

గోపియొక్క స్నేహితులందరు పెద్ద పెద్ద వాళ్లే. ధనవంతుల బిడ్డలే. వారియొక్క సహవాసం వలన గోపీనాథుకుకూడా నవనాగరికతా పిశాచములైన సిగరెట్లు కాల్చడం, జూదమాడడం ( డబ్బుపెట్టి పేకాట ), సారాయం త్రాగడం, మొదలైనవన్నీ అలవడినాయి.

లలిత ఆశయాలకు వ్యతిరిక్తంగా, తన పెనిమిటికివన్నీ అలవడినాయే అని లోలోపల కుందుచుండెను.

రామనాథరావు తనకొడుకు యిట్లు ప్రవర్తిస్తున్నాడని తెలిసి చాల చింతిస్తూవుండేవాడు. అయితే తాను వున్నానుకదా ! అన్నీ చూచూకోడానికని ధైర్యంగావున్నాడు. అటుపైన స్వతహాగాగోపిచూడక పోతాడా అనుకొన్నాడు. అప్పుడప్పుడు కొడుకును మందలిస్తూవుండేవాడు. గట్టిగా ఏమాట అంటే మనసు నొచ్చుకుంటాడో అని చూచి చూడనట్లు ఊరుకున్నాడు.



ఇట్లు అయిదేండ్లు గడిచిపోయినాయి. లలిత అత్తగారు చనిపోయి ఏడాదయింది. ఉబ్బసపు వ్యాధితో రామనాథరావు మంచం పట్టాడు. లలిత మామగారి కత్యంత ఆదరంతో సేవ చేస్తూవుంది. అప్పటికి లలిత కిద్దరు బిడ్డలు. ఒకకొడుకు, ఒకకూతురు.

ఒకనాడు మామగారు కోడలిని దగ్గరకు పిలిచి "అమ్మా! లలితా! గోపియిలా చెడిపోతాడని నేను స్వప్నంలో కూడా అనుకోలేదు. మంచి త్రోవకు తేవడానికని ఎంతో పాటుపడ్డాను. కాని నా ప్రయత్నం ఫలించలేదు. దీనికంతా నేనే కారకుడ ననుకొంటాను. ఒక్కగా నొక్క కొడుకని చిన్నప్పుడు వాడు అడిగిందల్లా యిచ్చాను. వాడు చెప్పిందల్లా చేశాను. ఒక్కకొఅత లేకుండా చూశాను. నేను నాచిన్నతనంలోనే నాతండ్రిని పోగొట్టుకొని ఎన్నో కష్టాలు అనుభవించి చదువుకొని ఈ మాత్రం పైకి వచ్చాను. నాకుమారునికి అట్టికష్టాలేవి దగ్గరకి రాకూడదని అతిగారాబంగా పెంచాను. అలా చేసిందంతా వానికే కీడుచేస్తున్నానని అప్పుడు నాకు తోచలేదు. అప్పుడే కొంచెం కఠినంగావుండి అదుపు, ఆజ్ఞలో పెట్టివుంటే యిట్టి స్థితికి వచ్చియుండడు. ఇప్పుడు గడచినదానికి చింతిస్తే లాభంలేదు. కానీ నాకు మరణం త్వరలోనే సమీపిస్తున్నది. నీకు, నీబిడ్డలకు గత్యంతరం ఏమా అని ఆలోచనగా వుంది. కాకి ముక్కుకు దొండపండు కట్టినట్లు నీవంటి సుగుణవతిని తెచ్చి ఈ దుష్టునికి ముడికట్టాను. గాని నీవే వానిని మంచి త్రోవకు తేవాలి. ఆధైర్యంసాహసం నీకున్నవని నాకు బాగాతెలుసు. నీ బుద్ధిసూక్ష్మతవల్ల నీభర్తను మంచిమార్గమునకు తే ప్రయత్నంచేయుము. అంతకంటే నేను యిక ఏమిచెప్పగలను తల్లీ!" అన్నాడు.

లలిత తన కండ్ల నీళ్లు చీరచెరగుతో తుడుచుకొంటూ "మామా! మీరు దానికోసరం బెంగపెట్టుకోకండి. నే నెట్లాగయితేనేమి. నాభర్తను సన్మార్గానికి వచ్చునట్లు చేస్తానని ఇదిగో ప్రతిజ్ఞ చేస్తున్నాను. దేవుడు నాకు తోడుపడుగాక" అని పొంగివస్తున్న దుఃఖమును ఆపుకొని చెప్పింది. రామనాథ్ 'తథాస్తు తల్లీ' అన్నాడు తృప్తి కలిగిన మనసుతో.



రామనాథరావు చనిపోయి నాలుగు నెలలు గడిచాయి. గోపీనాథ్ కిప్పుడు కొంచెం కష్టంగా తోస్తూవుండేది. తండ్రి గడించుచున్నడబ్బు రాకపోవడం వల్ల నిలువ యుంచిన కొంతధనం కొద్దిరోజుల్లోనే ముగించాడు. పొలం, తోట అదితాకట్టు పెట్టి డబ్బుతెచ్చి, దానిని కూడా కొద్దిరోజుల్లోనే వ్యయపరిచాడు. ఇకవుండేది ఇల్లు వకటే. దానిని కూడా తాకట్టు పెట్టడానికి తలపెట్టాడు. లలిత ఎంతబోధించినా తలకెక్కితే కదా! వినేవాడెవడు? తనయిష్టమే తనది. ఒరులసుఖం తన కెందుకు, రేపటిమాట

లేకుండా తనకు సుఖంగా వినోదాలతో కాలం గడచి పోతే, చాలనుకున్నాడు.

లలిత ఒకనాడు ఎట్లాగో ధైర్యం తెచ్చుకొని భర్తకు అన్నం వడ్డిస్తూ యీ విధంగా ప్రస్తావించింది.

"ఏమండీ! నేనొక్క మాటచెప్తాను. దయచేసి వింటారా? ఎప్పటిలాగు మీరు డబ్బు కెలవుచేస్తున్నారే! మీతండ్రి చనిపోయారు. ఆయన వున్నంత కాలం ఆయన భరించారు. ఇప్పుడన్నా ఈసంసారం ఎట్లా జరుగుతుందన్న చింతే మీకు లేకపోతే ఎలాగు? మీరు భార్యా,బిడ్డలున్నారన్న సంగతే మఱచిపోయారు. ముందు మనగ తేమవుతుందో ఆలోచించారా? భూమి తాకట్టు పెట్టారు. ఈకాస్త ఇల్లు కూడా తాకట్టు పెడతానంటున్నారు. వెనక ఏమవుతుందో మీకు తెలీదా? తలదాచుకోడానికి కూడా చోటు వుండదే. గనుక మీదుష్టసహవాసము విడచి క్లుప్తముగా సంసారము గడుపవలెనని ప్రార్థిస్తున్నాను."

"ఏమీ! నోరుముయ్యి, అంతధైర్యంగా మాట్లాడుతున్నావు. నీ కెందుకా సంగతులన్నీ. నీవా నాకు బుద్ధి చెప్పడాని కొచ్చావు. ప్రపంచంలో నీకొక్క దానికే బుద్ధివుంది. ఇంకెవరికీ బుద్ధిలేదనుకొన్నావా? నా యిష్టం వచ్చినట్లు నేను చేస్తాను. నీ ఆజ్ఞ నాక క్కరలేదు. పతివ్రతలు పతిమాట జవదాటరు అంటారు కదా? అట్లాగాక నీవే నన్ను ఆజ్ఞాపిస్తున్నావా? నీకేమి అధికారంవుంది? ఇక్కడుండడానికి నీకిష్టంలేకపోతే నీవు, నీబిడ్డలు నీపుట్టింటికి వెళ్ళండి. అక్కడ సుఖంగా వుండవచ్చు. మొన్న వాడువచ్చి పిలిస్తే ఎందుకు పోకుండా వూరుకున్నావు.

నేను కష్టమో, సుఖమో యిక్కడే అనుభవిస్తాను. నీకెందుకీకష్టం? పాపం.

"ఆహా! ఏమి చెప్పుతున్నారు? పౌరుషపూరితమైన పురుష జన్మమెత్తిన మీనోటినుండి యీ మాటలు వచ్చినందుకు నాకు చాలా చింతగా వున్నది. పురుషులై వివాహము చేసుకొన్నవారు వారి భార్యలనీ, బిడ్డలను ఎంత కష్టకాలంగానీ, ఎంత కరువుకాలంగానీ వారినిపోషించు భారము వారిది కాదా? స్త్రీకి భర్తేదైవము. భర్తే ప్రాణము. భర్తే సర్వస్వమూను. అయితే స్త్రీ యింత పూజ్యతతో, యింతప్రేమతో, భర్తనారాధిస్తూ వుంటే తన భర్త ఎటువంటివాడుగా నుండాలని భార్యకోరుకుంటుందో తెలుసునా? తనయొక్క ప్రేమమయమూర్తి నిష్కపటంగాను, నిశ్చల మనస్కుడై, సుగుణవంతుడై వుండవలెనని కోరుకొంటుంది. సుగుణమే ప్రేమకు ఆలవాలము. ఇటువంటి పతిని సేవించు సతే పతివ్రత అనదగును. గుణవతీయగు భార్య దుష్టుడైన తనభర్త నీవిధమగు పూజ్యభావముతోను, పవిత్ర ప్రేమతోను, తలచుకోలేదు. ఒకవేళ తలచినా తన్నుతాను మోసము చేసిందే అవుతుంది. పతి చెడుత్రోవ పట్టిన ఉత్తమసతి కనులార చూస్తూ వూరకుండలేదు. పరులు తనభర్తను గురించి నిందావాక్యములు చెప్పుతుంటే విని వూరకుండలేదు. తన పతియొక్క మంచిగుణములను జనులుపొగడడం విన్న సతే జన్మసాఫల్యం పొందినట్లు భావిస్తుంది."

లలిత పలుకులు గోపీనాధు చెవులకు ములుకులవలె నాటాయి. మొదట పట్టరానంత కోపం వచ్చింది గానీ ఏమీ పలుకక ఆకోపమును అడచుకొని ఆలోచనలో పడ్డాడు. ప్రతిమాటయొక్క యదార్థమును గ్రహించాడు. నిజముగా తాను ప్రవర్తించుచున్న నడవడి మంచిది కాదని తోచింది.

ఎన్నడు బదులు మాట కూడా చెప్పని తన లలిత యీనాడీవిధంగా మాట్లాడడం చూచి ఆశ్చర్య పడ్డాడు. మారు మాటాడక లేచిపోయాడు.

★ ★ ★

ఆరాత్రి "లలితా నీవుచెప్పిందంతా సత్యము. నేను మూర్ఖుడనయి వృధాకాలంగడిపాను. విషయాసక్తులకు లోబడి ధనమంతా వ్యయపరిచాను. నా నిజ కర్తవ్యం తెలుసుకోలేకపోయాను. చిన్నప్పటినుండీ ఒక్కకష్టముకోర్చి ఒక్కపనిచేసి ఎరుగను. గట్టిమాటైనాపడిఎరుగను. అలాపెంచారు, నాతలిదండ్రులు. ఒక్కకొడుకునయి వారు నాకిచ్చిన ప్రేమ ఆదరణలో కించిత్ భాగంకూడా నావలన వారు సుఖంపొందలేదు. పైగా నావిషయమైయే బెంగ పెట్టుకొని పోయిరేమో కదా? అయ్యో! ఇప్పుడనుకొని ఏమి లాభం, లలితా! నాకీబుద్ధి యిదివరకే చెప్పకపోతివా? నీవిటువంటి జ్ఞానవంతురాలవని, సుగుణములఖనివని అనుకోలేదు సుమా. ఇంత కాలము నిన్ను నిర్లక్ష్య భావంతో చూచినందుకు క్షమిస్తావా?" అని రెండు చేతులు పట్టుకున్నాడు.

లలిత లేచి "ఇంతటిదానికి క్షమించవలసిన దేముందిలెండి. నేనేమంత గొప్పదాన్ని కాదు. దైవ ప్రసాదంవల్ల మీ జ్ఞానం వికసించింది. కాబట్టి మీ దృష్టిపథంలో నేనట్లా కనపడుతున్నాను" అని నవ్వుతూ చెప్పింది.

లలితా నేడు నాకండ్లు విప్పావు. ఇప్పటికైనా నాస్థితి తెలుసుకొన కలిగానని సంతోషంగావుంది. నా పూర్వజన్మపుణ్యఫలంవల్ల నిన్ను భార్యగాపొంద కలిగాననుకుంటాను.

"నేను రేపేవెళ్లి నా చేతనయినంతవరకు ఏదైనా వుద్యోగమునకు ప్రయత్నిస్తాను చూడు" అని పడుకొనుటకు లేచిపోయెను.

లలిత తనభర్త మనసు మారినందుకు చాలా సంతసించి చేతులుమోడ్చి భగవంతునికి కృతజ్ఞతా పూర్వకముగ నమస్కరించెను.

♦ ♦ ♦

గోపీనాథ్ మరునాడు ప్రొద్దుటేలేచి కాల కృత్యములు దీర్చుకొని, దుస్తులుమార్చుకొని, బయలుదేరాడు. ఎన్నో షాపుల్లో, కంపెనీల్లో పని ఖాళీ వుందేమోనని కనుక్కున్నాడు. గాని లాభము లేకపోయింది. తిరిగి తిరిగి విసిగి, వేసారి, యింటికి చేరుకున్నాడు చెదరిన మనసుతో.

లలిత పెనిమిటిముఖం చూచి "ఎందుకల్లా మనసు చిన్నబుచ్చుకున్నారు? ఈవేళ దొరక్కపోతే రేపు దొరుకుతుంది. ఎప్పటికైనా దొరక్కపోతుందా? అంతవరకు మన దగ్గరున్న కొంచెం డబ్బును అతి జాగ్రత్తగా వాడుకొంటూవుంటే సరిపోతుందను కుంటాను. భయపడవలసిన పనిలేదు.' అంది.

ఆ మఱునాడు గోపినాధ్ పత్రికయందు ప్రకటింపబడిన నాలుగయిదు పనులకు దరఖాస్తు పెట్టుకున్నాడు.

♦ ♦ ♦

నాలుగురోజుల తరువాత ఒక కంపెనీలో "సేల్స్ మెన్" పనికి రమ్మని ఉత్తరంవచ్చింది. గోపి సంతోషంతో నియమిత దిన మచ్చటికివెళ్ళాడు. ఆకంపెనీ స్వంతదారుడు అతనిని చూచి పనిఇచ్చుట కొప్పుకొన్నాడు. ఆపని ఆరునెలలవఱకు వాయిదా. 80 రూ. జీతం, పైఖర్చులు, బత్తా అదివేరే యిస్తానన్నాడు.

గోపీనాధ్ పనిలోచేరాడు. లలిత పొదుపుగా సంసారం గడుపుతూవచ్చింది. గోపీ నిబ్బరమనసు గలవాడు. కాబట్టి తన చెడుసహవాసమువిడిచి నవనాగరికతా పిశాచములైన త్రాగుడు, పేకాట మొదలైనవి విడిచిపెట్టేశాడు పూర్తిగా.

అతని స్నేహితులు, తెలిసినవారందరు అతని యందు కలిగిన మార్పునుచూచి, ఆశ్చర్యపడ్డారు.

లలిత తల్లితండ్రులు తమ అల్లుడిట్లు చెడిపోవుట చూచి చాల చింతిస్తూవుండిరి. వారిని తమవద్దనే వచ్చివుండమని బ్రతిమాలుకున్నారుగాని వారందుకు సమ్మతింపలేదు. ఇప్పుడేదో ఒకపనిలోచేరి మంచి ప్రవర్తనలోపడినందుకు చాల సంతోషించారు.

♦ ♦ ♦

ఏది ఎట్లున్నా కాలచక్రం గడవకపోదుకదా? గోపీనాధ్‌కు యిప్పుడు యిద్దరు కుమారులు, ఒక కుమార్తెవుండిరి. చిన్నవానికి గోపీతండ్రి పేరే పెట్టుకున్నారు రామనాధమని.

అతనికిచ్చిన ఆఱుమాసముల వాయిదా గడచిన వెనుక పని ఖాయంచేశారు. పనియందు పట్టుదల కలిగి బాగా చేస్తూవుండడం చూచి 50 రూ ప్రమోషన్ చేశారు. ఆ కంపెనీకి చాలా లాభం కలుగుతూ వచ్చింది.

♦ ♦ ♦

ఇట్లుండగా కొంత కాలానికి ఆకంపెనీ మేనేజరు కంపెనీవిడచి వెళ్లుట తటస్థపడింది. అందులోవున్న అందరి వుద్యోగులలోను గోపీనాధే కష్టపడి పని చేయువాడని పేరుపొందినవాడు గనుక అతనికే మేనేజరు పదవినిచ్చారు. ఇప్పుడు గోపీనాధ్‌కు 500 రూ జీతం వచ్చుచుండెను. సంసారం నిర్విచారముగ జరిగిపోవుచుండెను. ఎంతో బీదబాలురకు విద్యకై సహాయము చేయుచుండును.

ఒకనాటి సాయంకాలం లలిత, గోపీనాథ్ వారి బిడ్డలతోటి వారింటివెనక తోటయందు చల్లగాలికి అక్కడున్న అరుగుపై కూర్చునివుండిరి. పిల్లలు తోటలో ఆడుకొనుచుండిరి. అప్పుడు గోపీనాథ్ "లలితా మానవుని ! సత్యమైన, పవిత్రమైన, జీవితమునందున్న ఆనంద మిప్పుడుకదా అనుభవించుచున్నాను. ఇటువంటి మనశ్శాంతి, తృప్తి, జ్ఞానము లేక అజ్ఞానాంధకారములోబడి అన్యాయముగ చెడిపోవుచుండుసమయములో నన్ను నీవు మేలుకొలిపావు. స్వసుఖమునకై ప్రాకులాడుచున్న నన్ను నా జీవిత నిజకర్తవ్యమునుదెలిపి కాపాడినావు. దైవభక్తిని కలిగించావు. నీవు మహాజ్ఞానివి సుమా" అన్నాడు.

"అంతా దైవానుగ్రహం. ఎప్పటికి కట్టుకున్న మగడుకాని, కన్నకొడుకుగాని, చెడుత్రోవబట్టుచున్న వుత్తమురాలైన సతి చూస్తూ వూరుకొనలేదు. వారు చెడ్డవారైనంతమాత్రాన వారిమీద ప్రేమ వుండదనికాదు. అధికప్రేమవల్లనే వారు బాగుపడవలెనని కోరును. అబ్బా! యిప్పుడెంత ఆనందంగా వున్నానో మీకు తెలుసా? భగవంతుడు నా అభీష్టమును నెఱవేర్చాడు యిప్పటికి" అనింది.

"అది నీవు చెప్పనక్కరలేకనే నీముఖమే చెప్పుచున్నదిలే లలితా. ఇక మన భావిజీవితశేషము కూడా నిదేవిధముగ గడిస్తే ధన్యులం" అని గోపి లలిత భుజముపై చెయ్యివేసి దగ్గరగా లాక్కొని బుగ్గల నదిమాడు.

♦ ♦ ♦

ఇంతలో చీకటిపడుచున్నందువల్ల అక్కడికి కొంచెం దూరంగా ఆడుకొనుచున్న రఘు, రాము, సరసు, ముగ్గురువచ్చి "అమ్మా యింట్లోకి పోదామా? ఆకలౌతూవుంది" అని తండ్రిని, తల్లిని చేతులు పట్టుకొని లేపి ఇంట్లోకి తీసుకొనివెళ్ళారు.



## కలత

కార్తీక దివ్య కౌముది
కాంతు లీనుచు నుండె
చుక్కల రాశంత నేడు
చోద్యముగ కనుపట్టె
నింగితెర చాటున మామ
తొంగి చూచుచు నుండె
కాగిన నా మనసు
కలత తేరుటలేదు

బెదరి పోయిన గుండె
బిఱు బిక్కు మంటోంది
నిండు కొన్నది నిరాశ
నేర్పుతో ఈహ్పాదిని
నమ్మిన యీ దాసిప్రేమను
వమ్ము చేయుట సబబ !
సామి నను రక్షింప
సాగి రాగ దోయి !

వి. లలితాదేవి.

# నిర్మల

గోటేటి శ్రీ జగన్మోహనరావుగారు

( గత సంచిక తరువాయి )

తెల్లారింది ...... తువాలు పైన వేసుకుని కుళాయిదగ్గరి కెళ్లాడు ............ ఆ అమ్మాయి ప్రత్యక్షం !.... ఏమిటిది ? — ఏదో ఇంద్రజాలంలా కనిపించిందతనికి.... అలా మాటలేకుండా నిలబడి పోయాడు ! .... తలపైకెత్తి చలించి చటుక్కున అడిగిందా అమ్మాయి .... "ఏమిటిలావచ్చారు !" ...

"ముందు రూంలో వుంటున్నాను ...."

"మా రూంలో వుంటున్నది మీరా ...." అని ఏదో బాధలోంచి నివృత్తి అయిన దానికి మల్లే దీర్ఘంగా శ్వాసవదిలింది ఆ అమ్మాయి. ఒక్క చిరునవ్వు నవ్వి "వస్తాను" అని మెఱుపులా తళుక్కుని మెరిసి మాయమైంది. ... మనోహరం యిప్పుడొక యంత్రంలాగ పనిచేస్తున్నాడు ... ఏంచేస్తున్నాడో ఎలాచేస్తున్నాడో తెలియటం లేదతనికి ... గదిచేరాడు పదినిమిషాల్లో ....

అవాళ సాయంత్రం ఆ అమ్మాయి తండ్రిని చూశాడు ... నిర్మల తండ్రే అతను ... ఆ అమ్మాయి నిర్మల ! .... మళ్లీ ఆశ్చర్యం కలిగిందతనికి ... తన్ని చూసి గుర్తుపట్టలేక పోయిందేమో ! ........ అప్పను తను మరీ యిదిగా మారిపోయాడు ... నుదుటిమీద నాటుండబట్టి అసలు ఆనవాలు పట్టడానికి వీలుండదు ... అందుకే నిర్మల స్వభావంలో అంత తేడా ! .... నిర్మల తండ్రిని కలుసుకుని చాలా సేపు మాట్లాడాడు. — చాలాసార్లు మాట్లాడాడు కూడాను. నిర్మల తండ్రి ఎందుకో అతని కేసి అంత ఆప్యాయంగాచూసి విసుగూ విరామం లేకుండా మాట్లాడుతాడు ! ... ఒక్క సారి తన జీవితపథంమీదకి పోయింది దృష్టి .... కాని ఏది నిర్ధారణ చెయ్యడానికీ వీల్లేదింకా. తను ఎవరైందీ యింకా నిర్మలకి తెలియదు ... తెలిస్తే ? ... ఏమో ఏమాతుందో నిశ్చయించలేక పోయాడు. తనవిషయం నిర్మల తండ్రికి టూకీగా చెప్పవలిసొచ్చినా ఫరవాలేదు. నిర్మలావాళ్ళూ కూడా నాలుగేళ్ళనుట్టీ రాజమహేంద్రవరంలో లేరట ... మరో గొప్పఉద్యోగం మీద బొంబాయి వెళ్లవలిసొచ్చిందిట ఆయన ... అందుకే తను శెలవులకి యింటికెళ్లినప్పుడు వీళ్లెవరూ కనిపించలేదు ... పాపం నిర్మలతల్లి ఒకపిల్లాణ్ణి కని చనిపోయిందట !

నిర్మలకీ, మనోహరానికీ స్నేహం ఎక్కువవుతూ వచ్చింది. మనోహరం అప్పుడప్పుడు వాళ్ల హాల్లోనే చాలా సేపు కూర్చుండి పోయేవాడు.

మూడు నెలలు గడిచినై. నిర్మలకి ఒకవిషయం తోచింది .... మనోహారం తల్లి దండ్రు లెవరో? — తనకి తెలియలేదు. తండ్రి చెప్పలేదు .... మనోహారాన్ని తను అడగ లేదు. అవాళ నిర్ధారణగా తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది.

మనోహారం అప్పుడే "రూం"కి వచ్చాడు. ...... నిర్మలనెమ్మదిగా వెళ్ళింది రూంలోకి ...

"సరీక్షగా నా రాకకి ఎదురు చూస్తూన్నట్టు .... ప్రవేశించారే — ఏవిటి విశేషం?"

"మనోహారంగారు గదితక్షణం ఖాళీచెయ్యాలని మానాన్నగారి ఆజ్ఞ" ఈ మాటలు కచ్చితంగా అంది నిర్మల.

"నిజమే ? — కారణం!" ఆతురతతో అడిగాడతను. వెంటనే ఫక్కుమని నవ్వింది నిర్మల. అప్రయత్నంగా అతనూ నవ్వాడు. ఆ తన్మయత్వంలో తనజేబులో వున్న కాగితాలు బల్లమీద పారేశాడు మనోహారం.

"ఏం కాయితాలవి ..." అంటూ వెంటనే వాటిని తీసింది నిర్మల ............ మనోహారానికి ఒళ్ళు జలదరించినట్టయింది ....

"అబ్బ — వొద్దు నిర్మలా ... అవిల్లా యిచ్చెయ్యి!" దీనంగా అడిగాడు.

"ఓహో కథ కాబోలు — నేను చదవకూడనిదా?"

"చదవకూడనిదని కాదు .... చదవకుండా వుంటే మంచిదని!"

అలా అయితే తప్పకుండా చదవాలి!"

"............................"

ఏవనాలో తోచటంలేదు మనోహారాన్ని. ఏంచెయ్యాలో అసలు అర్థంకావటం లేదు ... నిర్మలకి తను ఘోరవిరోధి — ఈ సంగతి మూడు నెలలుగా నిర్మల గ్రహించ లేక పోయింది... ఇప్పుడు తనంతటతనే తెలుపుకుంటున్నాడు ... అబ్బ ... మనస్సు అమితంగా కలిగిపోతోంది ... స్తబ్ధులా నుంచుండి పోయాడు.

కథ చదవటం ప్రారంభించింది నిర్మల ... నిర్మలముఖాన్ని తదేక దృష్టితో పరికిస్తున్నాడు మనోహారం. ఆ ముఖంలో మార్పుల్నిబట్టి కథాభాగం అతనికి స్పష్టంగా తెలుస్తోంది ......... చదవను, చదవను చేతులు వణుకుతున్నాయి నిర్మలకి .... పర్యవసానం వూహించుకో లేకుండా వున్నాడు మనోహారం.

ఆఖరిపేజీ చదువుతోంది తలబాగా కిందకి వంచేసి .... కొంతసేపటికి ధైర్యం తెచ్చుకుని తలపైకెత్తి మనోహారం కళ్ళల్లోకి దీర్ఘంగా చూసింది నిర్మల .... చేతులో కాయి

తాలు తమంతటవి క్రిందకిజారిపోయాయి ... "మనోహరం ... " అనగలిగింది మెల్లిగా. తన ప్రేమనంతా తెలియబరుస్తూ ప్రశాంతంగా చూశాడు నిర్మల కళ్ళల్లోకి ...... క్షణం నిశ్శబ్దం. "పూర్వపు విషయం మరిచిపో మనోహరం! ... ఇప్పుడు నా హృదయం నీది ... నేను ... !" అని పెదివి కరుచుకుని రివ్వున మాయమైంది నిర్మల ......

నిర్మల మాట్లాడేవరకూ పర్యవసానం ఊహించుకోలేక పోయాడతను ... నిర్మల తన కథ చదివిన తరువాతకూడా ప్రేమభావం వెలిబుచ్చుతుందని అతను ఎన్నడూ నమ్మలేదు .... నిర్మల మాటలు అతణ్ణి చలింపజేశాయి .... సంతోషంలో ఒక్క చిటిక వేసి నవ్వుతూ మంచంమీద కూలబడ్డాడు .... నిర్మల తనని అమితంగా ప్రేమిస్తోంది.... ఎటువంటి దారుణ సందర్భాలైనా ఆ ప్రేమని విచ్ఛిన్నంచెయ్యలేవు – అని గ్రహించాడు....

నిర్మలకీ సంఘటన ఆశ్చర్యం అనిపించింది ...... "ఆ మనోహరమే – యీమనోహరం" .... ఇది నిజమే ? అని నిర్మలమనస్సు లక్షసార్లు ప్రశ్నించింది ... "కాదు యితను వేరు ... " అని నిర్మల సమాధానం చెప్పుకోబోయింది .... కాని ఆ కథ అచ్చంగా కళ్ళకి కట్టినట్టుంది ...... వెంటనే "అప్పటి మనోహరానికీ యిప్పటి మనోహరానికీ ఎంత తేడావుందీ ... అయిదేళ్ళల్లో ఎంతమార్పొచ్చిందీ .... " అనుకుంది ...... అయినా ఏవిటో మనస్సు సమాధానపడలేదు .... ఆఖరికి "అప్పుడు మనోహరాన్ని అర్థంచేసుకోడానికి ప్రయత్నించలేదు ... ఇప్పుడు అర్థంచేసుకోవలసిన అవసరం తనంతటదే వచ్చింది .... " అనుకుంది ....... అప్పటికీ మనస్సు స్థిమితపడినట్టు కనబడలేదు. "మనోహరాన్ని చిన్నప్పుడే ద్వేషించి నిరసించావు కదూ — అతనే యీ మనోహరమే కూడాను — యిప్పుడు నీలో ఎందుకింత మార్పు .... "అని ఏదో ఉద్బోధించి నట్టయింది నిర్మలకి .... హృదయం దడ దడ కొట్టుకోవటం ప్రారంభించింది ...."కాదు, మనోహరమే నా సర్వస్వం...అతన్ని గౌరవిస్తాను అతన్ని ప్రేమిస్తున్నాను .." అనిగట్టిగా అరుస్తూ లేచింది నిర్మల...ఒక్క సారిగ పూర్వపుసంగతంతా మరిచిపోయి నట్టయింది.... ఇదంతా మరీ ఆశ్చర్యం. అనిపించింది నిర్మలకి ... అప్రయత్నంగా నవ్వింది.



# లోకవార్తలు

## దిగులు - బలుపు

దిగులువల్ల మనుష్యులు చిక్కిపోతారంటారు. కాదట! పైగా బలుస్తారటకూడా. ఈవిషయమై లండనులో ఇద్దరు డాక్టర్లు పరిశోధించి ఇలా అని కనుక్కున్నారు.

ఒకామె కేదో భయోత్పాతం కలిగిందట. దానితో ఆమె 70 పౌ॥లు పెరిగిందట. ఆ తర్వాత వెంట్రుకవాసిలో బాంబు తప్పించుకున్నదట. ఆ దిగులుతో మరి 280 పౌ॥లు పెరిగిందట. భయము తొలిగే చికిత్సపొందగా - 98 పౌ॥లు తగ్గిపోయిందట.

మరొకామె వాళ్ల తల్లి హఠాత్తుగా చనిపోగా - ఆ దిగులుతో 70 పౌ॥లు పెరిగిందట. చికిత్స చేయగా తగ్గింది. ఇది ఇంకా లోతుగా పరీక్షింపవలసిన విషయమని వారన్నారు.

♦ ♦ ♦

## అదృష్టమంటే అట్లాఉండాలి

ఒక పెద్దమనిషి లండన్‌లో చేపలు పట్టుదామని బయలుదేరాడు. ఒక వారధిమీదుగా వెళ్లుతుంటే గాలికొట్టి అతని కళ్ళద్దాలు విరిగిపోయాయి. తడువుకొని తెచ్చుకొంటే అందులో ఒక కంటిఅద్దం రాలిపోయింది. అట్లాగే ఒంటికంటి చూపుతోనే పాత గ్లాడుతూ నడిస్తే - ఒక ఇనపచట్టంమీద పడగా మొఖం గీసుకుపోయింది. ఆఖరుకు వారధిదాటి గాలం విడిచాడు. చేపపడ్డది. గాలంనుంచి తీతామని వంగేసరికి పంట్లాంవెనుక పిగిలిపోయింది. సరే భోంచేతామని కూచోని-రొట్టె కొరికాడు. పెట్టుడు పళ్లు విరిగిపోయాయి. అదృష్టమంటే అట్లాఉండాలి!

కాశీలో ఔరంగజీబు కట్టిన మశీదుగోపురం ఒకటి కూలిపోయింది.

♦ ♦ ♦

కాథరిన్ వాట్ అనే ఆమె బ్రిటిష్ ఆరోగ్య శాఖకు శిశుపోషణలో ముఖ్యమైన సలహాదారు. భారతదేశంలో సంచారంచేయును మనవారి ఆహ్వానంపై వచ్చుచున్నది.

♦ ♦ ♦

తిరుచనాపల్లిలో 18 గురు కమ్యూనిస్టులను అరెస్టుచేసినారు. వారిలో అన్నామలై విశ్వవిద్యాలయం విద్యార్థినికూడా ఒకర్తె.

♦ ♦ ♦

బొంబాయిలో ఒకని భార్య కన్పించకుండాపోయింది. అతడు పోలీసులకు రిపోర్టుచేశాడు. ఆమెతండ్రి ఒక దిక్కుమాలిన శవాన్ని తనకూతురిదే అని గుర్తుపట్టాడు. పోలీసు లామెభర్తను మరి ముగ్గురిని అరెస్టుచేసి హత్య కేసుపెట్టినారు. విచారణసమయం - ఆమె కోర్టుకువచ్చి తన్ను భర్త హత్య చేయలేదని చెప్పింది. ముద్దాయీలను నిర్దోషీలని విడుదలచేసి - ఆమె యెందుకు ఇంటినుండి పారిపోయిందో విచారణ చేయుచున్నారట కోర్టువారు.

♦ ♦ ♦

మరొకడి భార్యకూడా ఇలాగే కన్పించలేదు. ఒక పెంటదిబ్బలో ఉన్న స్త్రీకళేబరం తనభార్యదే అని అతడు గుర్తుపట్టాడు. పోలీసులు పత్తాదీయగా ఆ ప్రాంతంలోనే ఆమె బంధువుల ఇంట కన్పించిందట.

♦ ♦ ♦

రాజమండ్రివద్ద ఒకాయన ప్రత్యేకం ఎరువులు

చేసి 150 పిలకలుగల వరిదుబ్బు పెంచాడు. గుంటూరు జిల్లాలో మరో రైతు 171 పిలకల వరిదుబ్బు పెంచాడు.

♦ ♦ ♦

కాశీలో కందిరీగ కుట్టగా కారు డ్రైవరొకడు మరణించాడు.

♦ ♦ ♦

చికాగోలో నెహ్రూకు చిన్న మరనాగళ్ళను - ఆయన మనుమలు ఆడుకోను బహుమతిచేశారు.

♦ ♦ ♦

పాకీస్థాన్ అల్లరులలో - కౌసల్య అనే 7 సం॥ల బాలికను పాకీవాడొకడు రక్షించి ఢిల్లీ శరణాగత శిబిరానికి చేర్చాడు. హడలిపోయినందున ఆపిల్లకు నడవను, మాట్లాడను, వినను కూడా శక్తినశించినది. చిక్కి శల్యమైనది. ప్రధాని నెహ్రూ కరుణించి ఆబిడ్డ పోషణభారం వహించి నెల 1 కి, రు 15 లంపుతున్నారు. పుష్టిఅయిన ఆహారమివ్వగా స్వస్థత చెందుతున్నది. నడుస్తున్నది. మాట్లాడుతున్నది. వింటున్నది.

♦ ♦ ♦

కరాచీనుండి ముస్లిమేతర హోమోపతి డాక్టర్లు చాలామంది హిందూస్థాన్‌కు వలసవచ్చారు. అలాగే వలసవెళ్ళిన ముస్లిం హోమోపతి డాక్టర్లు, వాళ్ళ ఇళ్లు, ఆసుపత్రులు తమకు వసతులుగా ఇమ్మన్నారు. కానీ పాకీస్థాన్ ప్రభుత్వం వాటిని మంగళ్ళకు, కసాయి వాళ్ళకు ఇచ్చారు. వారికా మందులు, గ్రంథాలు నిరుపయోగం. మందులు పారబోశారు. లక్షరూపాయలుచేసే గ్రంధాలు పాతకాకితాలక్రింద అమ్మేశారు.

♦ ♦ ♦

కెనడాలో ఇండ్లల్లో తుడుచుకోడానికి చీపుర్లు తుడుపుకట్టలు తయారుచేయుటకు వరిగడ్డి సప్లైచేయగలరా - అని పాకీస్థాన్‌ను అడిగారట. వారాలోచిస్తున్నారు!

10,000 మంది బ్రిటిష్ వంటవారిని ఫ్రాన్సుదేశానికంపి, 10,000 పరాసువంటవారిని బ్రిటన్‌కు పిలిపించుకోను బ్రిటిష్ ప్రభుత్వం ఆలోచిస్తున్నది. పరాసువంటవాండ్రు నేర్పరులు. వారి వంటకములు తినడానికి అమెరికావారు మోజుపడతారు. అందుచేత బ్రిటన్ యాత్రకువచ్చిన అమెరికన్లచేత హెచ్చు డాలర్లు ఖర్చుపెట్టిస్తే - బ్రిటన్ ఆ డాలర్లుపెట్టి అమెరికావద్ద హెచ్చు ఆహారపదార్థాలు కొనవచ్చుఅని ఊహ. బ్రిటిష్ వంటవారివంట ఫ్రెంచివారికి రుచించకపోవచ్చు; పోనీ వాళ్ళదేశంలో వంట నేర్చుకుంటారంటారు.

♦ ♦ ♦

మన్నారుగుడి మ్యునిసిపల్ వైస్‌ఛేర్మన్ రామయ్యపిళ్ళ కుమార్తె సరోజ, అనే 4 సం॥ బాలిక పొయ్యి వెలిగించునప్పుడు చేతి రబ్బరుగాజా లంటుకొని యుండినవి. వెంటనే చీర అంటుకున్నది. వళ్లంతా కాలి చనిపోయింది.

♦ ♦ ♦

అజెర్‌బైజన్‌లో ఒక గ్రామమందు - 140 సం॥ల ఈడుగల రైతు కొడుకులు, కూతుళ్లు, మనమలు, మనమరాండ్రు, మునిమనుమలు, మునిమనమరాండ్రు వాళ్ల బిడ్డలు. అంతాకలిసి 112 మంది. ఆయన భార్య వయస్సు 117 సం॥లు. ఆయన పెద్ద కుమార్తెకీ మధ్యనే శతమానమైంది.

♦ ♦ ♦

## తాజా తుపానువార్త

ఆచార్యరంగాగారు కృష్ణలో పర్యటించి-తుపానువల్ల నష్టాన్ని ఇలా అంచనా వేశారు. కనీసం 500 మంది మనుష్యులు చచ్చి ఉంటారు; 6000 దుక్కిపశువులుకూడా నష్టమైనాయి. 1127 గ్రామాలలో 85000 ఇండ్లదాకా కూలిపోయాయి. దాదాపు అన్ని పంటచెరువులు కట్టలుతెగాయి. కొన్ని గ్రామాలలో శవాన్ని తగలేయడానికి జెత్తెడు జాగాలేకుండా అంతా నీటిమయము. మొత్తము నష్టమంతా 8 కోట్ల రూపాయలు ఉంటుంది.

# సంపాదకీయములు

## దాంపత్య ధర్మాలునేర్పే పాఠశాల

డెన్మార్కులో యువతీ యువకులకు దాంపత్య ధర్మాలునేర్పే పాఠశాల పెట్టేరు. అందులో పతివ్రతా ధర్మాలు, గృహస్థవిధులు చెప్పరు. వివాహితులైన దంపతులమధ్య నిత్యమూ ఏదో చీకొజగడాలు వస్తునే ఉంటాయి. వాటిని ఎలా మెలుకువగా తప్పించుకోవచ్చునో ఆ విషయాన్ని - ఈ పాఠశాలలో యువతీ యువకులకు నేర్పుతారు. "ప్రధానం భంగమైతే ఫరవాలేదు, పెండ్లిఅయి ఎడమొగం పెడమొగం కావడంకన్నా" అని ఈ పాఠశాలాధికార్ల అభిప్రాయం. పేరుపొందినవారు కొందరీ పాఠశాలలో అద్యాపకులు. వీరిలో ఒక స్త్రీ గొప్పలాయరు. మరొకరు గొప్పడాక్టరు. డేనిష్ గృహలక్ష్ములసమితి కధ్యక్షురాలాకతె. మరొకరు శస్త్రచికిత్సలో నైపుణ్యంగలవారు. ఈ పాఠశాలకు పెద్ద రెవరెండు కారల్ యడ్వర్డ్ దామ్-హెండ్రిక్సన్. ఈ ఫాదిరీ అంటాడు:- "ఈపాఠశాల చాలా విశాల భావంతో పెట్టాము. ఊరక బైబిలు పుస్తకాలు వెదజల్లినంత మాత్రాన వివాహపు చిక్కులు వీడిపోతాయా!" ప్రపంచంలో ఇలాంటి పాఠశాల యిదే ఆరంభం. నిజంగా ఇట్టి స్కూలు ప్రతిదేశంలోను ప్రతినగరం, పట్నములోను ఉండతగ్గది. అనేక దంపతులమధ్య నిరంతరం ఎందుకు పొగరాజుతూ ఉంటుందో ఆ కారణాలు చాలా పేలవమైనవి. కాని వారికే విడిస్తే - అవి తేలిపోవు. చెవిఇచ్చి ఆలించి, సానుభూతితో సలహాలిచ్చి - విశదపరిచే దాతలుంటే - ఆ పగలు, వాటి అంతట అవి అణగారిపోతాయి.

## రేషన్ బియ్యం కొల్తగాదు, తూకం

మద్రాసులో ఇకమీద రేషన్ బియ్యం కొల్చిగాక తూచిఇస్తారట. ఇది చాల అన్యాయం. కొల్త ఆడవాళ్ళకైనా, పిల్లవాళ్ళకైనా, రొఖంగా, తెలుస్తుంది. తూకంలో ఎంతైనా మోసంజరగడానికి అవకాశం ఉంటుంది. పాత కాకితాలు కొనేవాళ్లు బజార్లవెంట తిరుగుతుంటారు. వాళ్లు కాకితాలు తూచుకొనేటప్పుడు వాళ్ల రెండు కాళ్లు, రెండు మోకాళ్లు, రెండు చేతులు, రెండు మోచేతులు కాళ్లకు చేతులకు ఉన్న 20 వ్రేళ్లు, పిడికిలి-ఎన్నో కనిపెట్టి ఉండాలి. ఏమాత్రము ఏమారినా దేంతోనో నొక్కిపెట్టి రెండు వీశల కాకితాలు అరవీశక్రింద తూచేస్తారు. అయితే రేషన్ షాపు యజమానులు పెద్దమనుష్యులుగదా! అట్లా చేస్తారా అంటారేమో! ఆ పెద్దమనుష్యులు తక్కెడ పట్టుకొని తూయరు. ఈ కాకితాలుతూచే వాళ్లలాంటివాళ్లే అక్కడా నౌకర్లుగాఉండి తూస్తారు. ఎంత మిగిలితే అంత దుకాణాదారు కాకపోయినా, ఆ నౌకర్లు అయినా బ్లాక్‌మార్కెట్టులో అమ్మకోగలుతారు. ఈ రేషన్ బియ్యంకొని తీసుకొచ్చేవారు హెచ్చుగా నౌకర్లు, ఆడవాళ్లు, పిల్లలు - కాబట్టి ఇలా తూచడం చాలా ప్రమాదకరమైన అన్యాయం. ప్రస్తుతం ట్రిప్లికేన్ కో ఆపరేటివ్ స్టోర్సులోనే ఇది అమలుజరుగునని తెలుస్తూన్నది. అనుభవంమీద ప్రభుత్వమే దీన్ని రద్దుచేస్తుంది అని మా నమ్మకం.

## పటేలు తాతకు 74 సం॥ లు

యూనియన్ ప్రభుత్వపు డెప్యూటీప్రధాని శ్రీ వల్లభాయిపటేలుకు 74వ సం॥ము వచ్చినది. పుట్టెడు రోగానపడి తిన్నగా కోలుకొని మళ్లీ పరిపాలనావ్యవహారాలు నడుపుతున్నారు. ఈ శుభసమయంలో

వారిని దేశమంతా అభినందిస్తున్నది. అందరితో మా "గృహలక్ష్మి" యున్నూ వారి నభినందించి వారికి 100 సంలు ఆయుర్దాయమిమ్మని - భగవంతుణ్ణి ప్రార్థించుచున్నది. నేటిరాజకీయాలలో - నెహ్రూపటేల్లు విడదీయరాని జంట; ముఖ్యంగా గాంధీజీ కరువైన భారతదేశానికి వీరిద్దరు రెండుకండ్లు. మనదేశవ్యవహారాలు నేడు సర్వంనాటిసముద్రమును బోలియున్నవి. ఈ సముద్రంలో మనప్రభుత్వపు నౌకను వీరిద్దరు ఒకరుచుక్కాని ఒకరుతెడ్డుపట్టి నడుపుతున్నారు. కాబట్టి వీరిరువురి కలయిక, అన్యోన్యం - చిరంజీవిత్వము ప్రతిభారతీయప్రాణికోరదగినది. పటేలుతాత నిత్యకృత్యం - వడిదుడుకులులేకుండా నడవడానికి ముఖ్యకారకురాలు - ఆయనకుమార్తె మణిబెన్‌పటేలు అన్నసంగతి - "గృహలక్ష్మి"కి ప్రత్యేకంగా గర్వకారణం. ఆమెతండ్రిని సేవించడానికని బ్రహ్మచారిణిగానే ఉండిపోయింది. ఆత్యాగస్వరూపిణి చల్లగా పదికాలాలు గడపడం - పటేలుకు పూర్ణాయుర్దాయం. కాబట్టి ఈపట్ల ప్రత్యేకంగా స్మరించి ఆమె నాశీర్వదిస్తున్నాము.

## గృహలక్ష్ముల బాధ్యత.

ఆహారపదార్థాల దారిద్ర్యము ఇప్పటిలో తీరునట్లు కన్పించడంలేదు. అయితే యూనియన్ ప్రభుత్వమున్నూ రాష్ట్రప్రభుత్వమున్నూ శాయశక్తుల ప్రజాసౌకర్యమునకై తగినయేర్పాట్లు చేయడానికి తంటాలు పడుతున్నారు. కాని ఎవరెన్ని ఏర్పాట్లుచేసినా "గృహలక్ష్మి" వివేకంతో వానిని గమనించి సర్దుకోకపోతే లాభంలేదు. ముఖ్యంగా ఆంధ్రదేశానికి ఇటీవలవచ్చిన తుపానులవల్ల - ఈ సమస్య మరీ క్లిష్టమైనది. ముఖ్యంగా వరిపండే కృష్ణా గోదావరీజిల్లాలలో వరిపంట చాలామేరకు నాశనమైనది. ఆయా జిల్లాలు తమకుకాగా మిగతజిల్లాలకు ధాన్యం సరఫరా చేయగలిఉండేవి. ఇప్పుడా జిల్లాలకే ఇతర ప్రాంతాలనుండి సరఫరాచేయవలసియుంటుంది. కాబట్టి రేషన్‌పద్ధతి ఇంకా నిష్కర్షచేయవలసి వస్తుందేమో. అయితే ఈసమయంలో నే-నెహ్రూ అమెరికా కెనడాలను దర్శించడం శుభస్కరమైనది. నెహ్రూ 10 లక్షల టన్నుల గోధుమల నంపమని వారిని కోరినాడు. అవి వచ్చేయేర్పాటున్నూ కనుపడుతున్నది. అందుచేత గోధుమధర తగ్గించి - రైతులు దాచిపెట్టిన గోధుమలుకూడా బయటకు రప్పించి - విరివిగా గోధుమలు సప్లైచేయాలని వారిఆలోచన. అయితే దాక్షిణాత్యులము బియ్యాని కలవాటుపడ్డాముగాని - గోధుమలను తినసేర్వలేదు. ఇప్పటి కిస్తున్నగోధుమలే మనంపూర్తిగా వినియోగించుకోవడంలేదని ప్రభుత్వం వారు నిర్బంధంగా గోధుమరేషన్ వినియోగింపజేసే ఆలోచన లాలోచిస్తున్నారు. గోధుమల ధర బియ్యంతోపాటి చేశారు. గోధుమ బియ్యంకన్నా బలకరమని చెప్పనక్కరలేదు. అలవాటు చేసుకోవలసిన అవసరము గుర్తిస్తేచాలు. ఆ గుర్తించవలసినది "గృహలక్ష్మి". అట్లా గుర్తించి రుచికరంగా చేసిపెట్టితే - అందరూతింటారు. అయితే గట్టిచిక్కు వకటున్నది. గోధుమ ఇంతకాలమున్నూ పిండివంటలకే ఉపయోగము. గోధుమ పచనంచేసినరోజున బియ్యపువంట తగ్గించాలి. అన్నంతిన్నంత గోధుమతిన నవసరములేదు. అట్లాగాక - గోధుమపిండివంటతోపాటు అన్నమున్నూ - పొట్టకు దట్టిస్తే అరుసవ చేస్తుంది. అందుచేతనే - గోధుమ మనదేశానికిపడదని మామూలుమాట ఏర్పడ్డది. కాబట్టి గోధుమతినడం కుటుంబాలలో గృహలక్ష్ములు అలవాటుచేయాలి.

## స్త్రీలు: చదువు.

కొత్తరాజ్యాంగచట్టంలో వయోజనవోటింగుహక్కు ఏర్పడ్డది. అంటే వయసువచ్చిన పురుషులతో పాటు స్త్రీలున్నూ ఓటుచేయవచ్చు. అలా హక్కుకలిగినవారిలో 100 కి 90 వరకు నమోదైనారంటే స్త్రీలున్నూ విస్తారంగా నమోదు చేయబడ్డారన్నమాట. ఓటుహక్కు జాగ్రత్తగా వాడకపోతే ప్రజా ప్రభుత్వము కుంటుపడుతుంది. అందుకు ఓటర్లు విద్యావంతులు గావాలి. భారతయూనియన్‌లో 18 కోట్ల మంది వయోజనంఉన్నారు; వారిలో 170 లక్షలే చదువుకున్నవారు. అంటే పదవవంతైనాలేరు. వీరిలో

ఆడవారిదామషా ఇంకా తక్కువఉంటుంది. ఇప్పుడు ప్రాథమికవిద్య నేర్చే బిడ్డలు ఓటర్లయ్యేసరికి - 9 మొ. 15 సం॥లు పడుతుంది. కాబట్టి బాలబాలికలకు చదువుచెప్పించవలసిన అవసరం హెచ్చుగ ఉన్నదని యూనియన్ విద్యాశాఖామంత్రి అబుల్ కలాం అజద్ అన్నమాట అక్షరాలా నిజం. అప్పుడే ప్రజా ప్రభుత్వం సరియైన దేర్పడుతుంది. అవిద్య స్త్రీపురుషులందరూ నేర్వాలి. అందుకుగాను విద్యావంతులందరు నిర్బంధంగా ఉపాధ్యాయవృత్తి కొంతకాలమైనా చేసే ఏర్పాటు ఆలోచిస్తామన్నారు వారు. అది చాలా ప్రశంసాపాత్రమైన యోచన. ఈవిధానం అమలుజరగాలంటే— బడికిపోదగిన వయస్సుగల బాల బాలికలకు (జనాభాలో 12½%)కు 10 లక్షల టీచర్లుకావాలనీ, 50% అయిన వయోజనులకు చదవుచెప్పను ఆదామషాన 40 లక్షలుమంది ఉపాధ్యాయులు కావాలని వారి అంచనా. ఇదిన్నీ విద్యావంతురాండ్రైన స్త్రీలకు మంచి బ్రతుకుతెరువు చూపుతుంది. ప్రతివిద్యావంతురాలు కనీసం ఒక్కసం॥మైనా ఉపాధ్యాయినిగా పనిచేయనిది - వివాహం చేసుకోరాదనే నియమమేర్పడితే - స్త్రీలంతా విద్యావంతురాండ్రు కావడమేగాక వాళ్లు తల్లులైనప్పుడు చక్కగా తమ శిశువులకు శిక్షణనొసగగలరు. అవసరమైనవారు వివేకవతులైన దాదులై - పిల్లల తల్లులకు తీరికవేళల ఇతర ప్రయోజనకరమైన వృత్తులనవలంబింప వీలుకల్గించినవారవుతారు. స్త్రీసమాజములు - దూరపుసంగతులను గూర్చి ఊకదంపు ఉపన్యాసాలు, ఆకాశ పంచాంగపు తీర్మానాలు చేయడం కట్టిపెట్టి ఇలాంటి ప్రయోజనకరమైన ప్రణాళికలను ఆలోచించి - ఆచరణకుతేవాలి.

## మద్రాసు జమీందార్ల మొదటివాయిదా ముదరా.

మద్రాసు రాజధానిలో ముఖ్యమైన జమీందారీలను - ప్రభుత్వంవారు చిల్లిగవ్వ చేతులో పెట్టకుండా ఈ ఆగస్టులోనే లాక్కున్నారు. అసలు జమీందారీలు రద్దుపరుస్తున్నారనే - మాటపుట్టిన నాటినుండీ - రైతులు తాడుబొరి బకాయీలు పెట్టుతుండడంచేత శిస్తులు సరిగా వసూలుకాలేదు; పేష్కస్ తో బాకీలైనవి. చాలామంది జమీందార్లు అప్పులుచేసినవారేగాని - రూకలు జాగ్రత్తచేసినవారుకారు. అయితే వీరికై మేము ఎక్కువ వగవము. వీరి బంధుజాలమైన స్త్రీలవిషయమే మాకు విచారణీయం. వీరిలో చాల మంది అసూర్యంపశ్యలు. అదివారి తప్పుగాదు. వంశక్రమానుగతంగా వస్తున్న ఆభిజాత్యంకొద్దీ వారా సాంప్రదాయలకు బానిసలై వాటిని కాపాడుతూవచ్చారు. వారొకవిధమైన ఉన్నతజీవితానికి అలవడ్డారు. మానవునిది వింత చిత్తవృత్తి. తనకు స్వాస్థ్యము తప్పినప్పుడు తనవారిని - అతడు ఆదరించడం మందగించుట సైజము. అందులోను ఈజమీందారీ నగళ్లలో - వ్యక్తివ్యక్తికీ మధ్య ఇనపతెడిక లుంటాయంటారు. అలాంటప్పుడు - నేడు వీరి అధోగతి నిజంగా విషాదకరం. అధము శుభమెరుగని - ఈ నారీమణులు అన్నోదకాలకు అలమటిస్తూ - అలవాట్లు వదులుకోజాలక - చాటున అల్లాడవలసివస్తుంది. ఇప్పుడేదో కొంత ప్రథమవాయిదాగా జమీన్దారులకు ముదరాముట్టచెప్తారంటున్నారు. ఆధనంలోనుంచీ - వారు తమ ఆశ్రితస్త్రీజనానికి - యథోచితంగా, గౌరవంగా తమజీవితకాలమైనా గడుపుకోవడానికి న్యాయంగా ముట్టచెప్పునట్లు చూడవలసిన బాధ్యతకూడా వారి నీస్థితికి తెచ్చిన ప్రజాప్రభుత్వముమీద ఉన్నదని మా అభిప్రాయం. ముఖ్యంగా శాసనసభలలోని - స్త్రీసభ్యురాండ్రు ఈవిషయమై - కృషిచేయాలి. ఆనారీమణులకున్నూ మరొక్కమాట. కాలం మారుతున్నదని వారుగ్రహించి - మంచమున్నంతవరకు కాళ్లుముడుచుకోండని మా సలహా.




ఆపరేషన్ వైద్యము అను శల్యతంత్రము. గ్రంథ కర్తలు: డాక్టరు యం. దొడ్డయాచార్యులు, లక్ష్మీదేవిగార్లు. దొరుకుచోటు: డా. యం. దొడ్డయాచార్యులు గారు. లెక్చరర్ ఏ. జి. వి. కాలేజి కొవ్వూరు; పశ్చిమ గోదావరిజిల్లా. వెల రు 2/-

ఆయుర్వేదశాస్త్రంలోకూడ శస్త్రచికిత్సావిధానం ప్రశస్తమైనదే అని వాదించడానికి ఇందు ఎంతైనా సంజాయిషీ యివ్వబడినది. అయితే అది ఆచరణలో చాలమూలబడినదని ఆచార్యులవారు కూడా అంగీకరిస్తారు. కాలక్రమాన అగ్రజాతులవారు వ్రణములకోత సేవగింపగా క్రమముగా నది మంగళ్లపాలై అధ్వాన్న స్థితికి వచ్చింది. ఆయుర్వేద చికిత్స కనువైన శస్త్రసాధనములు వెంట్రుకనుగోయ సమర్థమగు పదునుకలిగి యుండవలెను - అని ఆచార్లగారు 43 వ పుటలో వ్రాశారు. ఇది మామూలు మాటే. చిరకాలం దీనిని వెంట్రుకవంటి సన్నని వస్తువును నడిమికి చీల్చునట్టిపదును - అని అర్థము చేసుకొనుచుంటిమి. కాని ఈ చికిత్సకులు కేశఖండన మొనర్చు మంగళ్లగుటచే వారి కత్తులవంటివనే అర్థమున వాడబడెనేమో! మొత్తమునకు ఆచార్లుగారు ఆ చికిత్సా విధానము, శస్త్రములు, నివారణమగు వ్యాధులు మున్నగు సంజాయిషీతో సుమారు 300 పుటల గ్రంధమును తయారుచేసిరి. పాశ్చాత్య శస్త్ర చికిత్సా విధానము ఎంతో అభివృద్ధిగాంచి యుండగా ఎన్నడో నిద్రజెందిన నీ ప్రాచీన విధానము నిప్పుడు మనుమెత్తి ముందుకు తేగలమా? అయితే ఈ గ్రంధసామగ్రిం జదివిన ప్రస్తుతపు విధానమున కగమ్య గోచరములైన కొన్నివిషయముల తెలియవచ్చునేమో. ఈ గ్రంథరచనలో మేము ముఖ్యముగా హర్షించు నదేమనగా - శ్రీ ఆచార్యులవారికి - వారి ధర్మపత్నియు - ఇందు తోడ్పడుట. గృహలక్ష్ములిట్లు భర్తల వ్యవహార వ్యాపారముల తోడ్పడ కల్గుట పూర్వపుణ్య ఫలము. గృహలక్ష్ములందరు అందుకు కృషిచేయదగును.

స్వతంత్ర (ఆంగ్లం) సంవత్సర సంచిక, 1949 సంపాదకులు: శ్రీఖాసా సుబ్బారావుగారు 160, లాయడ్స్‌రోడ్డు, రాయపేట, మద్రాసు, ధర రు 1-8-0 లు.

ఆంగ్ల పత్రికా సంపాదకులుగా పేరుపడిసిన సుబ్బారావుగారి సంపాదకత్వముక్రింద స్వతంత్ర (ఆంగ్ల) పత్రికకు మరోసంవత్సరం గతించి క్రొత్తసంవత్సరం ప్రారంభమైంది. దీంతో శ్రీసుబ్బారావు గారు గొప్ప రచయితలే గాక- పత్రికానిర్వహణవిషయంలో వ్యాపారనిపుణులు గూడా అని ఋజువైంది. ఏమంటే-అతఃపూర్వమువలెగాక - ఈపత్రికను ఆయనే స్వంతదారు. రచనా సామర్థ్యం - వ్యాపారా నైపుణ్యం రెండూఉండడం ఆంధ్రులల్లో చాలా అపరూపము. అంచేత ఈపత్రికకు పదికాలాలపాటు మంచి దశఉందని సంతోషించవచ్చు. సంచిక చాలాసుందరంగా తయారుచేయబడింది. ముఖపత్రంమీద, లోపలా దేవీప్రసాద్ రాయ్‌గారి త్రివర్ణ చిత్రాలు, భావగాంభీర్యంతో ఉట్టిపడుతూ ఉన్నాయి. సర్. సి. పి, చలపతిరావు, చెట్టూర్, హరీంద్రనాథ చటోపాధ్యాయ, మొదలైనవారి ఉత్తమరచనలతో ఒప్పారుచున్నది. పార్థసారధిగారు భగవాన్ రమణమహర్షినిగూర్చి వ్రాసినవ్యాసం జిజ్ఞాసులంతా శ్రద్ధతో చదువదగినది. రామగోపాల్ చిత్రించిన చర్చిల్ మూడుమూర్తులా అతదుట్టిపడట్టున్నది.

# శ్రీ విరోధినామ సంIIర కార్తిక, మార్గశిర మాసములు.

| | తేది | వారం | వివరములు |
|---|---|---|---|
| నవంబరు నెల | 16 | బు | ఏ 38-57 ఉ. ఫ 28-14 విష్క 40.0 రావి 19-42 సర్వేషామేకాదశి. |
| | 17 | గు | ద్వా 33.6 హ 24.8 ప్రీ 32.12 రావి 14.26 గోవత్సద్వాదశి. |
| | 18 | శు | త్ర 27-7 చి. 19.45 ఆయు 24.17 రావి 4.56 మాసశివరాత్రి జ్వాలాముఖియోగః |
| | 19 | శ | చతు 21.19 స్వా 15.49 సౌ 16.30 రావి 0.56. |
| | 20 | ఆ | ● అ 15.51 విశా 12.3 శో 8.59 దివి 21.30 ప్రతిపత్తిథిః. |
| | | | **మార్గశిర మాసము** |
| | 21 | సో | శు పాడ్యమి 10.53 అనూ 8.47 అతి 1.52 దివి 22.11 చంద్రోదయం. |
| | 22 | మం | వి 6.38 జ్యే 6.11 ధృతి 49.22 కా 6.38 పూ. షా. |
| | 23 | బు | త 3.17 మూ 4.29 శూ 44.16 దివి 0.36 రా 0-21 చతుర్థిదినత్రయం. |
| | 24 | గు | చ 0.57 పంచమీ 48.54 పూ. షా. 3.48 ధనురాయనం |
| | 25 | శు | ష 59.58 ఉ.షా 4-15 దివి 14.32 సుబ్రహ్మణ్య షష్ఠి |
| | 26 | శ | స 60.0 శ్ర 5.57 దివి 16.26 మిత్రసప్తమి యమకంటకయోగః. |
| 1949-వ సంII | 27 | ఆ | స 1.23 ధ 8 52 జ్యే 1 కాలభైరవాష్టమీ అనధ్యాయద్వయం. |
| | 28 | సో | అ 4.4 శత 13.0 హ 32.54 బ 4.4 రావి 2.37 |
| | 29 | మం | న 7-50 పూ. భా. 13.11 వజ్ర 33-19 రావి 16.58 నందినీనవమి. |
| | 30 | బు | ద 12.32 ఉ. భా. 24.9 సిద్ధి 34.16 రావి 29.37 ఏకాదశీతిథిః. |
| | 1 | గు | ఏ 17.48 రే 30.37 వ్య 35-37 శూన్యతిథిః |
| | 2 | శు | ద్వా 23 13 అశ్వి 37.8 దివి 26.1 ద్వాదశీతిథిః. |
| | 3 | శ | త్ర 28.17 భ 43.15 దివి 3.35 హనుమద్వ్రతం. శనిత్రయోదశి. |
| | 4 | ఆ | చతు 32.43 కృ 48.40 శివ 38.27 దివి 14.57 అనధ్యాయత్రయం. |
| | 5 | సో | ○ 36.9 రో 53.4 సిద్ధ 38.11 రావి 3.54 దత్తాత్రేయ జయంతి. |
| డిసెంబరు నెల | 6 | మం | బపాడ్యమి 38.24 మృ 56-21 దివి 7.50 |
| | 7 | బు | వి 39.24 ఆర్ద్ర 58.21 శుభ 34.48 తివి 18.3. |
| | 8 | గు | త 39.8 పున 59.7 శుక్ల 31.41 రావి 1.6. |
| | 9 | శు | చ 37.36 పుష్య 58.44 తివి 18.59 ఉత్పాతయోగః |
| | 10 | శ | పం 34.56 ఆశ్లే 57.17 దివి 2.20. |
| | 11 | ఆ | ష 31.17 మ 54.54 దివి 26.8 యమకంటకయోగః. |
| | 12 | సో | స 26.53 పూఫ 51.48 దివి 13.52 సప్తమీతిథిః. |
| | 13 | మం | అ 21.43 ఉఫ 48.9 దివి 8.42 తిథిద్వయం. |
| | 14 | బు | న 1.69 హ 44.7 దివి 7.44 దశమీతిథిః. |
| | 15 | గు | ద 10.18 చి 39.56 దివి 2.43 రావి 25.26 స్మార్తానామేకాదశి. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

